# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA


సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి



సంపుటము ౧౯    జనవరి 1947    సంచిక ౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0 అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి రు. 0-6-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడీకాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయకారకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగల తావులు ప్రకటింపబడినవి ఇతర తావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసినచే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటుకూ చేయునది.

### చిరునామా మార్పు

చిరునామా యందు మార్పుండుచో ముందుగానే తెలుపవలయును. అట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

---

**ముఖ్యమైన గమనింపు**

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసుబాంకులపైననే పంపవలెను.

---

# విషయసూచిక




## జ్వరము

జ్వరము - మానవుల శక్తిని, జీవనమును పీల్చివేయును. కనుక జ్వరము మిమ్ము ఆవహించినదనగనే దానిని పారద్రోలవలయును. అట్లుచేయుచో మిమ్మాపిశాచి జీర్ణించి పిప్పిచేయదు.

## అర్క

జ్వరము వచ్చినదనగనే అర్కను ప్రయోగించుడు. ఆహార, విహార ఋతుభేద దోషంబులవలన అన్నాశయమునందు క్రిమికూటము చేరి పలువిధములైన జ్వరములు సంభవించుచున్నవి. వాతజ్వరము, పిత్తజ్వరము, కఫజ్వరము, సన్నిపాతజ్వరము మరి యితర విష జ్వరములు, కడుపులో ప్లీహమను జ్వరగడ్డను, అర్క కుదుర్చును. ఈ ఔషధమును పసిబిడ్డలకుగూడ యివ్వవచ్చును.

1 ఔ. రు. 1-2-0.

కేసరికుటీరము లిమిటెడ్ - మదరాసు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# పునరాగమనం

1928-వ సంవత్సరమునుండి 'గృహలక్ష్మి' ఆంధ్రనారీమండలి, అభ్యుదయమునకు తోడ్పడవలయునన్న సంకల్పముతో చేసిన సారస్వతసేవ మా చదువరులకు తెలియును. కాని, 1942 వ సంవత్సరమున, అనివార్యమగు యుద్ధపరిస్థితులలో మా పత్రికా ప్రచురణమును కొంతకాలము ఆపుదలచేయుట తప్పినదికాదు. అట్లు చేయవలసి వచ్చినదికదాయని మేము మిక్కిలి వగచితిమి. ఇప్పుడు మరల పత్రికాప్రచురణమును సాగింప గలిగితిమికదాయని సంతోషపడుచున్నాము. ఎప్పటివలెనే 'గృహలక్ష్మి' ఆంధ్ర స్త్రీజనమానసిక వికాసమునకు, ఆహ్లాదమునకు తోడ్పడుటయే ముఖ్య ఆశయము. అందుచే వారి సానుభూతి ఆదరణలను 'గృహలక్ష్మి' ఎప్పుడును ఆశించుచుండును.

మా పత్రిక మానివేసిన ఈనాలుగు సంవత్సరములు మనదేశమునకే కాక ప్రపంచమున కంతా గొప్ప క్లిష్టదినములు. సుమారు అయిదు సంవత్సరములు పైగా అతివిజృంభణముతో యుద్ధము జరిగినది. గొప్ప రాజ్యములంతరించినవి. జర్మనీ, ఇటలీ, జపాను, వాటిననుసరించిన మరికొన్ని చిన్నదేశములు పడిపోయినవి. పట్టణములు, కర్మాగారములు, గ్రామములు, శిథిలములై పోయినవి. లక్షలకొలది ప్రజలునశించిరి. ఖండాంతరమున మృత్యుదేవత యీ ఘోరాట్టహాసముతో తాండవమాడినది.

పోరునిలిచినదేకాని, శాంతికుదురలేదు. ఐరోపాఖండములో, దేశములమధ్య అనుమానము, అసూయ, భయము వీడలేదు. మరల ఎప్పుడో, ఎందులకో యుద్ధము అన్న జంకు తొలగలేదు. ఆసియా ఖండములో సామ్రాజ్య సిద్ధాంతము ఏమియు మారలేదు. పెరిషియా, అరేబియా, బర్మా, జావా, సుమిత్రా మొదలైన దేశములలో స్వతంత్రోద్యమములు ప్రబలి, అధికారవర్గము వారికిని, జాతీయ సంస్థలకును సంఘర్షణ హెచ్చుగా వున్నది.

యుద్ధము జరుగుచున్న కాలమున, మిత్రమండలి నాయకులందరు, ఈ యుద్ధము సామాన్యమైన పోరుకాదనియు, రెండు పరస్పర విరుద్ధమైన సాంఘిక, నైతిక ఆదర్శముల కు కల్గిన పోరాటమనియు, మరి ఇంతటినుండి ఒక నూతన వ్యవస్థ నిర్మించి, జాతి, మత, దేశభేదములులేక ప్రజాసామాన్యమునకు స్వాతంత్ర్యము, ఆర్థికాభివృద్ధి, కలుగజేయవలెననియు, విశేషించి, మాటలాడియుండిరి.

యుద్ధము ముగిసినవెంటనే నాయకులు ఎప్పటివలె రాజనీతి ననుసరించుచు, మిత్రలాభము మిత్రభేదము అనెడి రెండు సూత్రములను అవలంబించుచున్నారు. ప్రజా సామాన్యమునకు ఒసగిన వాగ్దానములు నీటిలోవ్రాసిన వ్రాతలై పోయినవి.

ప్రజకు కావలసినది, రాజనీతికాదు. ఆర్థిక విధానములతో, వ్యవస్థలతో, వేదాంతములతో వారికి పనిలేదు. తినుట కన్నము, ధరించుటకు బట్ట, నివసించుట కిల్లు, తమ తమ మత స్వాతంత్ర్యము ఆత్మగౌరవమును కాపాడుకొనుటకు సంఘశాంతి. వీటిని తమ ఏలుబడిలోవున్న ప్రజలకిచ్చుటకు, అభయమివ్వలేని ప్రభుత్వము నిరర్థకము. ఇదియే కీర్తిశేషులైన అమెరికా దేశపు ప్రెసిడెంటు రూజువెల్టు ఉద్బోధించిన నాలుగు స్వాతంత్ర్యముల ముఖ్యసూత్రము. దానిని కార్యరూపమున పెట్టుటయే వివిధ దేశనాయకుల ముఖ్య కర్తవ్యము.

మనదేశములో కూడా ఈనాలుగు సంవత్సరములలో అనేక మార్పులు జరిగినవి. 1942 వ సంవత్సరమున కాంగ్రెసు నాయకులను ఆగస్టులో అరెస్టుచేసిన వెంటనే దేశమంతా గొప్ప ఆందోళనము, అల్లరులు బయలుదేరినవి. వెంటనే బెంగాలులో అసాధారణమగు క్షామము ప్రబలి, లక్షలకొలది ప్రజలు మరణించిరి. 1945 వ సంవత్సరమున వేవెలు ప్రభువు చేయదలచిన రాజకీయ సమాఖ్య కొనసాగినదికాదు. దేశమంతా తీవ్రమగు ఆందోళనము వెలువడినది. బ్రిటిష్ ప్రభుత్వము వారి తరుపున ముగ్గురు మంత్రులు మనదేశమునకువచ్చి రాచకీయ సమశ్యను పరిష్కరింప నుద్యుక్తులై మన

దేశనాయకులతో సంప్రదించుటయు, మనలో అంగీకారము కుదురక పోవుటచే వారే వొక ప్రణాళికను తయారుచేసి ప్రచురించుటయు అందరికి తెలిసిన విషయము.

ఆప్రణాళిక కాంగ్రెస్ వారొక విధముగను, లీగువారు మరొక విధముగను వ్యాఖ్యానము చేయుటలో నిర్మాణసభ కూడుటయే సంశయమైనది. ఇంతలో బెంగాల్ బీహార్, మున్నగు రాష్ట్రములలో హిందూ మహమ్మదీయ కలతలు పెరిగి, అనేకమంది ప్రజలు తమప్రాణములను, ఆస్తులను గోల్పోయిరి.

నెహ్రూపండితుని ఆహ్వానించి వేవెలు ప్రభువు ప్రభుత్వకార్య నిర్వాహక వర్గము నేర్పరుప కోరుటలో జిన్నాప్రభృతులకు ఇష్టములేక చాలకాలము వారు సహకారమును నిరాకరించిరి. చిట్టచివరకు ప్రభుత్వ వర్గములో చేరినను ఏకగ్రీవముగ యావద్భారత దేశ కళ్యాణమునకు కృషిసల్పుటకు ఇష్టపడుటలేదు.

ఈ అల్లరులలో వ్యక్తముగా నున్నది ఏదనిన ప్రజలలో నూతనముగా జనించిన యొకప్రబల చైతన్యము. శతాబ్దములు, సుప్తావస్థలోనున్న జాతి మేల్కొనినది. చరిత్రాత్మకమైన తమపూర్వ ఆదర్శములను, నాగరికతను, మరల సాధ్యశ్య పరుపవలెనన్న ఉత్సాహము ప్రజలలో పెరుగుచున్నది. జాతిమతభేదములను పాటించక స్వతంత్రము కొరకు అందరు కృషిసలుపవలెనను ఆశవృద్ధి యగుచున్నది.

దేశాభ్యుదయమునకు ఇప్పుడు ఆటంకములు కనిపించుచునే యున్నవి. కాని ఏదేశమును, కష్టములను సాధింపకయే స్వాతంత్ర్యమును, కళ్యాణమును సంపాదించుకొనలేదు. మనదేశములో కూడా అన్ని యాటంకములు తొలగచేసుకొని ప్రజలలో వికసించుచున్న శక్తి జయించగలదనియు, మరల మనదేశము ప్రపంచములో నాయకత్వము పడయగలదనియు మానమ్మకము.

ఇదిప్రస్తుతము మనదేశమునకు ఒకస్మృతి సమయము. ఈమహాకాలమున అందరు, అందులో ముఖ్యముగ స్త్రీలు తమకర్తవ్యమును నెరవేర్పవలయును. కొన్ని రోజులవరకు స్త్రీలకు ఆర్థిక, సాంఘిక, స్వాతంత్ర్యము, హక్కులు, లేని కారణమున వారి అభివృద్ధికి ఆటంకము కలిగినది. ఇప్పుడు ప్రజల అభిప్రాయములు అనేక విషయములలో అందులో స్త్రీల విషయములో చాలభాగము మారినవి. ఇప్పుడు రాబోవు హిందూలా చట్టములో స్త్రీలకు జరిగిన అన్యాయము కొంతభాగము తొలగిపోగలదు. వారికి చేకూరిన స్వాతంత్ర్యమును స్త్రీలు దేశకళ్యాణమునకు నుపయోగింతురని మాదృఢనమ్మకము. వారిసంకల్పమునకు కొంచమైనను, దోహద మొసగునేని 'గృహలక్ష్మి' కృతార్థురాలగును.

ఇట్లు విధేయుడు, కే. ఎన్. కేసరి.

# గృహాలక్ష్మి కి

## స్వాగతము.

శ్రీమతి చింతలపూడి జగదాంబ గారు.

---

ఒకచోట బాలబాలికలకు బోధింతు
వధికాదరమున సత్కథలనీతి
విదుషీమణులతోడ విజ్ఞానవిషయముల్
చర్చింతువొకచోట సారఫణితి
భాషింతువొకచోట యోషామణులతోడ
పాకశాస్త్ర విశేషప్రాభవమ్ము
స్త్రీజనాభ్యుదయసంసిద్ధి మార్గమువన్య
సింతువేరొకచోట స్త్రీలతోడ

నాంధ్రసీమంతినీ నిలయాంగణముల
కీవు వేంచేయు వేళల హితవుమీర
ఆంధ్రగృహిణుల భాగ్యావరావతార!
జనని "గృహాలక్ష్మి" నీకుసుస్వాగతమ్ము.

# కేసరి ఉన్నత విద్యాలయము.

మైలాపూరు, మద్రాసు.

మద్రాసు నగరములో సంపత్సరాల తరబడి లక్షలాదిగా ఆంధ్రులు నివసించుచున్నను వారి బాల బాలికలకు మాతృభాషలో విద్యగఱపుటకు గావలసిన ప్రాథమిక ఉన్నత విద్యాలయములులేకుండుట చింతింపదగినది. ఇందులకు ప్రభుత్వముగాని, కార్పొరేషను గాని ప్రత్యేక తెనుగు పాఠశాలలు ఏర్పాటు చేయకుండుట గర్హ్యనీయము. దీనికి కారణము ఆంధ్రుల అలజడిలేకుండుటయే. "దాహమైనప్పుడు నూతిని త్రవ్వుకొనుట" మనవారికి పరిపాటి. నేటికిని చెన్నపట్టణములో మన బాలబాలికలకు మాతృభాషలో బోధించు పాఠశాలలు ఎన్ని అవసరమో లోతుకు దిగి గమనించిన దెలియగలదు.

ఇట్టి పరిస్థితులలో 1940 సం|| మైలాపూరులో నివసించు ఆంధ్రప్రముఖులు తమ బాలబాలికలకు ఒక పాఠశాల నిర్మింపవలసిన ఆవశ్యకతను పూర్తిగా గుర్తించిరి. అందుచేత వారు ఒక సభనేర్పాటు చేసి అందులో రమారమి 400 బాలబాలికలు ఏబడికిపోవుటలేదనియు, పాఠశాలకు పోవు 439 లో 225 మంది తమిళము నేర్చుకొనుచున్నారనియు అంచనావేసిరి. ఈలోటును దీర్చుటకు దెలుగు పిల్లలకు పాఠశాల అవసరమని తీర్మానించిరి. అందులకు దగిన ద్రవ్యము సేకరించి మైలాపూరులో ఒక ప్రాథమిక

విద్యాలయమును 1940 సం|| లో స్థాపించిరి. తమ పిల్లలకు ఒక ప్రత్యేక పాఠశాలలేదను ఆతురత, ఆవేదన తీరినది.

1943 సం|| లో డా|| కే. యన్. కేసరిగారు (కేసరికుటీరము అధిపతులు) కల్పతరువు వలె ఈచిన్న పాఠశాలను ఒక ప్రముఖ ఉన్నత పాఠశాలగా మార్చుటకు ముందంజవేసిరి. దీని అభివృద్ధికి ఎంతవరకైన సాయము చేయుటకు సంకల్పసిద్ధులైరి. విద్యాలయమునకు స్వంత భవనము అవసరమని తలచి రాయపేట హైరోడ్డులో నెం. 163. (Palm Grove) 'పామ్ గ్రోవ్' అను విశాలమైన రమ్యమైన 70 వేల రూప్యములు విలువగల ఉన్నత భవనమును బహూకరించిరి. విద్యాలయ ద్రవ్యము, భవనము, ఇతర వ్యవహారములు జయప్రదములుగా నిర్వహించుటకు డా|| కేసరిగారు కొద్దిమంది ఆంధ్ర ప్రముఖులతో గూడిన కార్యనిర్వాహకవర్గము (School Committee) నొక దానిని ఏర్పాటు చేసిరి. విద్యాలయము కమిటీపరము చేయుచు డా|| కేసరిగారు పలికిన పలుకులు "ధర్మాత్ములు తమ మనశ్శాంతికొఱకు కొన్ని కొన్ని ధర్మకార్యములు చేసి సంతృప్తి పొందెదరు. కొందరు దేవాలయములను కొందరు విద్యాలయములను కొందరు మరికొన్నిటిని స్థాపించెదరు. దేవాలయములను కట్టించినవారు అందు ఏ "రామునో" "కృష్ణునో" "ఈశ్వరునో" ప్రతిష్ఠించి ప్రతిదినముసుగంధతైలాదులతో అభ్యంజనాది కార్యములొనర్చి నానావిధ నైవేద్యములుచేసి అర్చకులు, కొందఱు భక్తులు కడుపార ఆరగించెదరు. కాని దేవుడు కన్నెత్తైనను చూడడు. అట్టి నోరులేని శిలా విగ్రహముల నారాధించుటకంటె సకల మార్గదర్శకమగు విద్యాలయమును స్థాపించి బాలబాలికల హృదయమనెడి పరమాత్మకు జ్ఞానజ్యోతిని వెలిగించుట ఉత్తమమని తోచి యీ విద్యాలయమును నెలకొల్పినాను. ప్రతి శుక్రవారము సరస్వతీదేవిని పూజించి ఫలహారములు పంచిపెట్టునపుడు బిడ్డల యానందము కోలాహలము చూచువారికి కనులపండువుగ నుండును. అట్టిబిడ్డల జ్ఞానోదయమునకు దోడ్పడిననే గొప్పపుణ్యముండుననియు, "మానవ సేవయే మాధవసేవ" అనునదే యథార్థమనియు, నా యభిప్రాయము." అనెడి సత్యవాక్యములు అమృతమయములై యీ విద్యాలయము నింత యభివృద్ధిలోనికి దెచ్చినవి.

## ధర్మకర్తలు.

కమిటీ అధ్యక్షులు సర్. అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ B- A., B.L., శ్రీ M. శేషాచలపతి M. A. B. L., సెక్రెటరీ & కరస్పాండెంటు; జస్టిస్ V. గోవింద రాజాచారి B. A. B. L. కోశాధిపతి (Treasurer)

కమిటీ సభ్యులు: జస్టిస్ B. సోమయ్య. B.A., B.L., రావుబహుదూర్ ప్రొఫెసరు. D. S. శర్మగారు. M.A., L. T., శ్రీ పురం ప్రకాశరావు, శ్రీ P. సత్యనారాయణరావు. B.A., M. L., శ్రీ S. రామమూర్తి, B.A., B. L.,

1944 సం|| లో కమిటీవారు మాధ్యమిక పాఠశాలగా (Middle School) మార్చుటకు విద్యాశాఖ డైరెక్టరుగారి యనుమతి కోరగా 1 వ ఫారమునుంచి 3 వ ఫారము వఱకు అనుమతి నిచ్చిరి. కమిటీ

వారు పాఠశాలాభివృద్ధి చక్కగా నున్నదని గ్రహించి, మాతృభాషలోనే బోధించు ఉన్నత పాఠశాలగా మార్చుటకు తీర్మానించిరి. ఇందులకు ప్రభుత్వము సమ్మతించగా 1945 సం|| లో 4 వ ఫారమును, 1946 వ సం|| లో 5 వ ఫారమును స్థాపించిరి. ఇందులకు అత్యధిక ద్రవ్యము, తగిన భవనము, విశాలమైన ఆటస్థలము అవసరము. ఈ సంవత్సరము మైలాపూరులో భీముని పేటలో 120 గ్రౌండ్ల స్థలము 100 సం|| లకు క్రీడాస్థలముగా నుపయోగించుటకు అద్దెకు తీసుకొనుటకు ప్రయత్నములు జరుగుచున్నవి. భవన నిర్మాణమునకు, ఆటస్థలమునకు, ఇతర పురోభివృద్ధికి ఒకటిన్నర లక్షల రూపాయలు కావలయునని అంచనా వేయబడినది. దీనిలో గొంతభాగము ప్రభుత్వము ఇచ్చినను మిగత ద్రవ్యము ఆంధ్రధనికులు ఉదారబుద్ధితో విరాళము లివ్వవలసియుండెను. అప్పుడే డా|| కేసరిగారు 50 వేల రూప్యములు విరాళమిచ్చిరి. పైమొత్తమును పాఠశాల అవసరముల నిమిత్తము నుపయోగింప నిర్దేశించిరి. ఇట్లు వారు 1½ లక్షలు (ఒకటిన్నర లక్షల రూపాయలు) పైగా విరాళ మిచ్చినందులకై వారిపేరుతో "కేసరి ఉన్నత పాఠశాల" (Kesari High School) అని పిలువబడుచున్నది. ఇంతేగాక కేసరిగారు వారి భార్య స్వర్గీయ శ్రీమతి కనకమ్మగారి పేర తెలివిగల పేదవిద్యార్థినులకు నెల 1కి రూ 100/ స్కాలరుషిప్పు (ఉచిత వేతనము) ఇచ్చుచున్నారు. రావుబహుదూర్ M. నరసింహం పంతులుగారు, మద్రాసు. తెలివిగల పేద విద్యార్థికి సం|| కు రూ. 80/ ఉచిత వేతనము నిచ్చిరి.

విద్యాలయములో 2-వ తరగతి మొదలు 5-వ ఫారము వఱకు కలదు. 1947 జూన్ మాసములో 6 వఫారము స్థాపింపనున్నారు. ఇందులో 400 బాలబాలికలు చదువుచున్నారు. విద్యాలయములో బాలికల సంఖ్యబాగుగా హెచ్చుకొలది వారికి ప్రత్యేక సెక్షన్లు ఏర్పాటు చేయుటో, లేక ప్రత్యేక పాఠశాలనేనిర్మించుటో కూడ కమిటీవారు యోచించుచున్నారు.

## ఉపాధ్యాయవర్గము.

ఉన్నతోపాధ్యాయులు శ్రీ ఎస్. రాజగోపాలరావు, M.A., L.T., ఉపాధ్యాయులు. శ్రీ K. V. రాధాకృష్ణశాస్త్రి B.A., B.O.L., L.T., శ్రీమాన్ T. తిరుమలాచారి M.A., L.T., శ్రీమతి T. V. మంజుల, B.Sc., L.T., శ్రీ ఎల్. జనార్దనశర్మ. (భాషాప్రవీణ) శ్రీ సత్యానందం, శ్రీ జి. రంగస్వామిరావు, శ్రీ సి. వెంకటరావు, శ్రీ ఎమ్. హనుమంతరావు, శ్రీ కె. సుబ్రహ్మణ్యం, శ్రీమతి వి. వెంకటసుబ్బమ్మ శ్రీ టి. నారాయణరావు, శ్రీమతి పి. అన్నపూర్ణ, శ్రీ టి. గౌరీనాథశర్మ (శిరోమణి & విద్వాన్) శ్రీ ఎన్. కృష్ణయ్య (డ్రాయింగు టీచరు), మిస్. ఎస్. జయలక్ష్మి (Games Instructress), మిస్. ఎన్. శకుంతల (సంగీతోపాధ్యాయిని) శ్రీ కె. జగన్నాథరావు. (Clerk).

పాఠశాలలో 1, 2, 3, ఫారములవారికి సంస్కృతము నిర్బంధవిద్యగానున్నది. 4, 5, ఫారములలో తెలుగేగాక సంస్కృతమును బోధించుచున్నారు. 5-వ ఫారములో లెక్కలు, హిస్టరీ, కెమిస్ట్రీ, ఫిజక్స్ ఆప్షనల్సు (optionals) గానున్నవి.

# లలిత కళలు — క్రీడలు

బాలురను శ్రీ Ch. సత్యానందంగారు ఫుట్‌బాలు, క్రికెటు, బాడ్మింటన్, వాలీబాలు మొదలగు వానిలోను, మిస్. ఎస్. జయలక్ష్మి బాలికలను ఆటలలోను తర్ఫీదు నిచ్చుచున్నారు. ఈమె వారములో 4. రోజులు బడివదిలిన పిదపకూడ ఆటలాడించుచున్నారు. పైఇరువురు మద్రాసు హిందూస్థాన్‌స్కౌట్ సంఘమువారి అధ్వర్యమున హిందూస్థాన్ బాలబాలిక భటసంఘముల(Boys' Scout & Girls' guide) స్థాపించి దానిపురోభివృద్ధికై మిక్కిలి పాటుపడుచున్నారు. మిస్. ఎస్. శకుంతలమ్మ శాస్త్రియుక్తమైన శ్రావ్యమైన తియ్యని సంగీతమును బాలికలకు నేర్పించుచూ పెద్దలమన్ననల బడసినది. ఈమె కూడ వారములో 3 రోజులు బడివదిలిన పిదప గంటసేపు బాలికలకు సంగీతము నేర్పుచుండును. పాఠశాల ఆవరణములో ఉదయము సాయంత్రము శ్రీసత్యానందముగారును, శ్రీ పార్థసారథిగారును శ్రీమతి ద్వారకాబాయమ్మగారును సంగీతపాఠశాలనొకదానిని స్థాపించి బాలికలకు సంగీతము నేర్పుచున్నారు. శ్రీ పి. ఎస్. శర్మగారు (కూచిపుడి) నర్తనశాల స్థాపించి పెక్కుబాలికలకు భరతనాట్యము, నృత్యము నేర్పించుచున్నారు.

ఈ పాఠశాలకు అన్నివిధములతోడ్పడిన డా॥ కే. ఎన్. కేసరిగారు పూజనీయులు. వీరుమద్రాసులో ఆంధ్ర తలిదండ్రులకు బాలబాలికలకు ఈవిధముగా చేసిన మహోపకారము మరువరానిది. వీరికి తరతరముల వారు కృతజ్ఞులైయుందురు. కాని వారిమీదనే అంతభారము వేయుట సమంజసముగాదు. ఇంకాదీనిని అన్నివిధములవృద్ధికిదీసుకొనివచ్చు బాధ్యత చెన్నపట్టణములోని ఆంధ్రులమీదేగాక, యావదాంధ్రావనిలోని ధనికోదార స్వభావులమీదకూడనున్నది. కాన దీనిపురోభివృద్ధికి, ఔన్నత్యమునకు తోడ్పడి అచిరకాలములోనే దీనిని కళాశాలగా మార్చుటకు పెద్దలెల్లరు భూరివిరాళములను అమిత ఉత్సాహముతో ఇత్తురని యాశించుచున్నాము.

ఇట్లు

కేసరి ఉన్నత విద్యాలయ కమిటీ.

## కేసరి ఉన్నత విద్యాలయమునకు విరాళములిచ్చినవారు.

ఈక్రింద నుదహరించినవారు దయతో మావిద్యాలయమునకు విరాళముల పంపినందులకు వారికి మాకృతజ్ఞత తెల్పుచు, వారిపేర్లను ప్రకటనకై యిచ్చుచున్నాము.

---

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీమతి కాశీనాథుని రామాబాయమ్మగారు | ... | రు. | 3500 | 0 | 0 |
| శ్రీ పిళ్లా నరసింహపాత్రుడు గారు ... | ... | ,, | 1000 | 0 | 0 |
| Madras Neo Malthus (శ్రీవేపారామేశంగారి ద్వార) | ... | ,, | 2200 | 0 | 0 |
| జస్టిసు బి. సోమయ్య గారు ... | ... | ,, | 1000 | 0 | 0 |
| జస్టిసు. వి. గోవిందరాజాచారి గారు ... | ... | ,, | 2000 | 0 | 0 |
| శ్రీ పురం ప్రకాశరావు గారు ... | ... | ,, | 2000 | 0 | 0 |
| శ్రీ పి. సత్యనారాయణరావు గారు ... | ... | ,, | 1000 | 0 | 0 |
| Sree Raja of Munagala ... | ... | ,, | 2232 | 0 | 0 |
| డాక్టర్ జమ్మి వెంకటరమణయ్య అండ్ సన్సు | ... | ,, | 2000 | 0 | 0 |
| ప్రొప్రైటరు. కోటవారిట్ల ఎస్టేటు. ... | ... | ,, | 1116 | 0 | 0 |
| సర్ అల్లాడి క్రిష్ణస్వామి అయ్యర్ గారు ... | ... | ,, | 1000 | 0 | 0 |
| శ్రీ ఎం. సత్యనారాయణగారు ... | ... | ,, | 500 | 0 | 0 |
| ,, ఎన్. సుబ్రహ్మణ్యంగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, జి. చంద్రశేఖరశాస్త్రిగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, పప్పు సోమసుందరంగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, శ్రీపతి రామమూర్తిగారు ... | ... | ,, | 200 | 0 | 0 |
| ,, కొండ కోటయ్యగాదు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, బి. వి. సుబ్రహ్మణ్యంగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, బి. సత్యనారాయణరాజుగాను ... | ... | ,, | 141 | 0 | 0 |
| ,, ఇ. వెంకటేశుగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, పి. శివరామకృష్ణయ్యగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, కె. భీమశంకరంగారు ... | ... | ,, | 116 | 0 | 0 |
| ,, కె. కామేశ్వరరావుగారు ... | ... | ,, | 200 | 0 | 0 |
| ,, వి. సుబ్రహ్మణ్యగారు ... | ... | ,, | 116 | 0 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| శ్రీ బి. వి. రామనరసు గారు | ... | ... రు. | 116 | 0 | 0 |
| ,, జి. వెంకట్రామశాస్త్రి గారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, వి. వియ్యన్న గారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, ఎం. అప్పారావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, శేషా సారధిగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, ఎ. సాంబశివరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, కామరాజు కృష్ణమూర్తిగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, కె. వి. రాజుగారు | ... | ... ,, | 150 | 0 | 0 |
| ,, ఎం. శేషాచలపతిగారు | ... | ... ,, | 200 | 0 | 0 |
| ,, ఎం. ఎస్. రామచంద్రరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, పి. పార్థసారధిగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, డి. వి. రెడ్డిపంతులుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, డి. ఆర్. కృష్ణారావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, వి. సూర్యనారాయణగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, వి. రంగాచారిగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, జి. బాలపరమేశ్వరరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, ఎ. వెంకటచలంగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, వి. దామోదరరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, పి. వి. వల్లభాచార్లుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, బి. ఎస్. రామచంద్రరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, బి. లక్ష్మీనారాయణగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, సి. రామారావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, డి. మునికృష్ణయ్యగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, డి. సూర్యప్రకాశరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| ,, ఎ. భుజంగరావుగారు | ... | ... ,, | 116 | 0 | 0 |
| వివాహములకువచ్చిన అద్దెలు | ... | ... ,, | 263 | 0 | 0 |
| డా॥ కె. యన్. కేసరిగారు చేసిన హుండి వసూళ్లు | | ... ,, | 117 | 8 | 0 |



# స్త్రీ విద్య ఎటులుండవలెను ?

## శ్రీమతి సూరినాగమ్మ గారు

బెజవాడ కృష్ణాతీరాన తొలి యేకాదశినాడు స్నానానికి జనంవస్తున్నారు. గవర్నరుపేట నుంచి రాజమ్మగారు, గాంధీపేటనుంచి శారదాంబ, పూర్ణానందంపేటనుండి లలిత, కొత్తపేటనుంచి అన్నపూర్ణమ్మ గారు వచ్చి ఒకేచోట స్నానానికి తారసిల్లారు.

అన్న :- ఓహో ఎంతసుదినం! అంతా ఒక్కచోటే సమావేశమైనారే? యీమధ్య బొత్తిగా కనబడటమేలేదు. విశేషాలేమిటి?

శార :- ఏమివిశేషాలున్నయ్యమ్మా. అయినా నాకేంతెలుస్తుంది. పనివుంటేచేసుకుని కృష్ణా రామా అంటూ కూచుంటాను. పిల్లలుకాస్త భారతం భాగవతం చదివితే వింటూవుంటాను. అంతేనమ్మా.

లలి :- అన్నట్లు మరచిపోయాను. రాజమ్మగారు, మొన్న మీఅమ్మాయని మెట్రిక్యులేషన్ పరీక్షకు పంపారు గాబోలు. ప్యాసయిందా ?

రాజ :- మరే, లేదమ్మా. కాన్వెంటుచదువు మాన్పించి రెండేండ్లయిందా మరీ. మధ్య మానేయటంచేత ఎంతకష్టపడి చదివినా లాభంలేకపోయింది.

లలి :- కాన్వెంటులో చదివితే ఇంగ్లీషు బాగావస్తుందంటారే. పరీక్షదేల్లోపోయిందో ?

రాజ :- ఇంగ్లీషులో బాగానే మార్కులొచ్చాయండీ.

లలి :- మరి లెఖ్ఖల్లోపోయిందా?

రాజ :- అబ్బే కాదండీ! పాడు తెనుగులోనేమార్కులు సరిగారాలేదుట. తెలుగు అర్థంకావటం చాలాకష్టమండీ.

లలి :- సరి, చాలబాగుంది. తెలుగుబిడ్డకు తెలుగు అర్థంకాలేదంటే మనం ఎంతదౌర్భాగ్య స్థితిలో వున్నామో మనమాతృభాషను ఎంత తేలిక చేస్తున్నామో తెలుస్తున్నది. తెనుగుదేశంలో పుట్టి, పెరిగిన పిల్లలు తెలుగులో పరీక్ష తప్పారంటే, అంతకంటె అవమానకరమైన విషయం మరేమివుంటుంది?

శార :- "అయినా ఇంగ్లీషు చదువువలన బొత్తిగా మనచదువేపోయింది. ఎందుకొచ్చిన చదువులమ్మా ఇవి. హాయిగా భారతం భాగవతం చదువుకుంటేచాలదూ? మాపిల్లలుచూడు ఎంత చక్కగాచదువుతారో?

అన్న :- "పనిముద్దూ, పాటముద్దూ అన్నారు. చదువుకున్న ఆడవాళ్లకుపనిచేయడమే పరువుకాదుట. ఇంగ్లీషు చదువుకున్నవాళ్లు క్లబ్బుల్లోనూ, తెలుగు చదువుకున్నవాళ్లు పురాణాలదగ్గరా కూచోని మగవాడికి వండిపెట్టటానికే మండిపడుతున్నారు. ఏదో యిన్ని కృష్ణ నీళ్లుతెచ్చుకొని పిల్లలకు, పెద్దలకు వుడకేసి పెడుతున్న నాపనేబాగుంది?"

లలి :- "ఇంగ్లీషు చదువే చదువుగాని తెలుగంత పాడుచదువు లేదనిరాజమ్మగారూ, ఇంగ్లీషెందుకు భారతభాగవతాలు చదివితే చాలదా అని శారదాంబ, చదువుకుంటేనే పాడయిపోతారు పనిపాటలుచేతనైతే చాలదాఅని అన్నపూర్ణమ్మగారు అంటున్నారు. నా అభిప్రాయమేమిటంటే, ప్రస్తుతకాలపరిస్థితుల ననుసరించి యీమూడూ మనకు కావాలసిందే. మొన్నవేసంగిలో మావారు బొంబాయివెళ్లారు. ఇంటికి ఏదో టెలిగ్రాం వచ్చింది.

నాకు తెలియదాయె. కాగితం చేతపుచ్చుకొని ఇల్లిల్లుతిరగాల్సొచ్చింది. మావారికిఉత్తరంవ్రాయాలంటే చిరునామా ఇంగ్లీషులోవ్రాస్తేగాని పోదు. మాఅబ్బాయి కలకత్తాలో చదువుతున్నాడు. అక్కడికైనాఅంతే. ఎవరికి ఉత్తరంవ్రాద్దామన్నా చిరునామాకోసం ఇతరులను యాచించవలసిందే. మగవాళ్లు ఉద్యోగాలకోసం దేశాలుతిరగడంవల్ల ఆడవాళ్లకుగూడా ఏకొద్దిగానైనా ఇంగ్లీషురాకపోతే చిక్కుగానేవుంది. అయితే రవంత ఇంగ్లీషు చదివినంతమాత్రాన మాతృభాషలో కృషిచేయటం మానగూడదు. అన్యభాషలో ఎన్నేళ్లు చదివినా అర్థంకానివిషయాలు మన భారత, భాగవత, రామాయణాది గ్రంథాల్లో ఇమిడివున్నవి. సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే భూగోళం ఖగోళం సైన్సు అన్నీబోధపడతై. పృథుచక్రవర్తికథలో చూడండి. వ్యవసాయపరిశ్రమ, గాంధీగారుచెప్పే గ్రామపునర్నిర్మాణం ఎంతచక్కగా చెప్పివున్నదో. ఇంకాయెన్నోవిషయాలు సూక్ష్మంగా విచారిస్తే బోధపడతయి. పట్టుదలతో కృషిచేస్తే, కాలేజీలకుపోయి చదివిన మగవారికంటె గృహకృత్యములు నెరవేర్చుకుంటూ మనం మనభాషలో చదివి ఎంతో జ్ఞానంసంపాదింపవచ్చును. అయితే చదువుకున్నాంగదా అని పనిపాటలుమాని క్లబ్బుల్లోను, పురాణాలదగ్గర, వృథాకాలయాపన పనికిరాదు. గృహనిర్వాహకమే గృహిణికి ముఖ్యకర్తవ్యం. సేవాసౌఖ్యం మనపాలిటిసొమ్ము. సేవ అంటే బానిసలాగా పనిచేయటంగాదు.

దైవసేవ, భర్తసేవ, బిడ్డలసేవ, అతిథిసేవ, సాధుసేవ, బీదలసేవ ఇంకాయెన్నో మహత్కార్యాలున్నాయి. విద్యావతియైన గృహిణి బిడ్డలకు స్వయంగా చదువుచెప్పవచ్చు. ఒకవేళ తీరదనుకోండి, పంతులు ఏంచెపుతున్నాడో, పిల్లలు ఏంచదువుతున్నారో, అదైన తెలుసుకోగలదు. పూర్వం మనగురుకులవాసల్లోవుండే ఋషిపత్నులు, విద్యార్థులను కన్నబిడ్డలలాగా అన్నపానాదులిచ్చి ఆదరిస్తూ పనిపాటలు చేసుకునేవారు; చదివే పాఠాలలో తప్పులుపట్టేవారలు. అట్లాంటి విద్యాలయాలు ప్రస్తుతం మనదేశంలో లేకపోవటం మనదురదృష్టం. అందులో స్త్రీవిద్యకు అసలే అవకాశంలేదు. బెజవాడలాంటి వూళ్లో ఆడవాళ్లకు ఉపయోగపడే జాతీయ విద్యాలయం ఒక్కటైనా వున్నదేమోచూడండి. కాన్వెంటులోచదివిస్తే క్రిస్టియన్ల వేషభాషలు రావడంతప్ప జాతీయభావాన్ని కలుగజేసే విద్య రవంతైనా అలవడదు. పోనీ మగపిల్లల బడికే పంపుదామంటే అక్కడవాళ్ళు చదివేచదువు అధ్వాన్నంగా వుంది. జీవితంలో సగంభాగం విద్యాలయాలకే ధారపోసి చదివినా విజ్ఞానసాధకము, జీవనోపాధిగల విద్య అలవడుటలేదు. పోనీ అందుకే ఆశపడదామన్నా రవంత ఎదిగిన ఆడపిల్లల్ని అక్కడికిపంపితే అల్లరి, అగడమూను! కాబట్టి ఇకముందు కాంగ్రెస్ ప్రభుత్వంలోనైనా, రాజకీయభాష, మాతృభాష, పనిపాటలు, చేతిపనులు అన్నీచేర్చి స్త్రీలకు ఉపయోగకరమైన విద్యాలయాలు స్థాపించి స్త్రీలను ఉన్నత విద్యావతులను చేస్తేగాని భారతజాతికి ఔన్నత్యము రాజాలదని మనమంతా కలసి గాంధీగారికి విన్నపం పంపుకుందాం.

అనిగంభీరంగా ఉపన్యాస ధోరణిలో చెప్పింది. అంతా విస్తుపోయి వింటున్నారు. ఆమెమాటలకు మరిబదులులేదు. అందరూ ఆమెను పొగడుతూ, నీమాటలు మా అందరికీ నచ్చినై, నీవుఏంచేయమంటే అదేచేస్తాం, అని స్నానాలుచేసి ఎవరిండ్లకు వారువెళ్లారు.

మా లలిత అప్పుడప్పుడు స్నానానికొచ్చి ఇట్లాగే ఉపన్యాసాలిస్తూవుంటుంది.

# ఉత్తరహిందూదేశపు ఆచారములు

శ్రీమతి వంగల వాణీబాయి గారు.

---

ఈమధ్య ఇక్కడ మాస్నేహితులింట్లోవారి అబ్బాయి వివాహమైంది. వాళ్లు మాకుబాగా పరిచయంగల వాళ్లుకాబట్టి పెండ్లికి మేమంతా వెళ్లవలసివస్తుందను కొన్నాం. కానివాళ్ల పిలుపులు వచ్చేసరికి మా ఇంట్లో అందరికీ ఆశ్చర్యం వేసింది. వాళ్లు ఎంతసేపూ మగవారినే తప్పక పెండ్లికి రావలసిందని బ్రతిమాలుతారేగాని ఆడవాళ్లమంటేలేదు. శుభలేఖల ద్వారాగాని స్వయంగాగాని తప్పకమాకు కూడా పిలుపురాగలదనే దృఢ నమ్మకంతో ఉన్నాం. అంతదో స్త్రీగల వాళ్లూ మమ్మల్ని (ఆడవాండ్లను) వారింటపెండ్లికి పిలువక పోవడానికి కారణంతెలుసుకోకుండా ఉండలేకపోయాను. వాళ్లను చూడడానికి, వెళ్లినట్లుగా వారింటికి వెళ్లి అన్ని సంగతులూ గ్రహించుకు రావాలని బయలుదేరాను. అక్కడ పెండ్లికొడుకుతల్లిని కొన్ని కుశలప్రశ్నలు అడిగినపిమ్మట మీరు పెండ్లికి ఎప్పుడు బయల్దేరి వెళ్తున్నారని నేనడిగే సరికి ఆమె నా వంక అత్యాశ్చర్యంతో చూచి ఎక్కడైనా ఆడవాండ్లు పెండ్లికివెళ్తారా? అంది! పెండ్లికి వెళ్తారా అంటే ఆమెకెంత ఆశ్చర్యంకలిగిందో, అంతకుపదిరెట్లు అధికాశ్చర్యం వేసిందినాకు! అంతట వారి ఆచారవ్యవహారాలన్నీ తెలుసుకోవాలనే కుతూహలం జనించిందినాకు. ఆమెనడిగి అన్నీ తెలుసుకొన్నాను. మనలో పెండ్లిండ్లు జరిగాయంటే ఏతమాషాలు చేద్దామన్నా, ఏముచ్చట్లుజరపాలన్నా, అంతా ఆడువారి సరదాయే. ఆడువారులేని పెండ్లేలేదు. ఒకవేళ అట్లాచేద్దామన్నా దానికి శోభేలేదు.

ఇక్కడివారు పెండ్లికొమారుని తల్లినే పంపరాదట! ఒకరేమిటి? పెండ్లికొడుకు తరఫుఆడువారెవ్వరూ వెళ్లకూడదు. పెండ్లికూతురు తరఫు వారైనా ఇంట్లోనించే ఏపాటలు పాడినా-ఆటలాడినా! బయట ఎవరికీ కనబడరాదు.

పెండ్లియింకా కొద్దిరోజులుండనగానే ఒకమంచి రోజుచూచి పెండ్లికొడుకును చేస్తారు. ఒకపెద్ద కిరీటంలాంటిది డాగురేకులతోను, పూసలతోనూచేసి అతని నెత్తిమీద పెడతారు. దానిని "మేర్", అంటారు. పెళ్లికొడుకుతోపాటు అతనితమ్ముడినో లేక మరోచిన్న అబ్బాయినోకూడ తోడపెండ్లికొడుకుగా చేసి అతనినెత్తినకూడ ఒక "మేర్" పెడ్తారు. ఆడువారంతా వారిచుట్టూ గుమిగూడి పాటలుపాడి, హారతులిచ్చి ఒక్కొక్కరూ ఆ అబ్బాయిలకు బొట్లుపెట్టి ఆశీర్వదిస్తారు.

వివాహానికి కొంతకాలం ముందు-అనగా సంబంధం నిశ్చయమైనవెంటనే, "తిలక్" అనేవేడుక జరుగుతుంది. పెండ్లికొడుకు పెండ్లికూతురింటికి వెళ్లాలి. అక్కడ పిల్లతరఫువారు ఊరివారందర్నీ పిలుస్తారు. అందరూవచ్చి పెండ్లికుమారుని దీవించి వారివారికితోచిన కానుకలిచ్చి వెళ్తారు. పిల్లతండ్రి అతనికి కాళ్లుకడిగి వెండిసామానూ, బట్టలు ఇస్తాడు. హిందుస్తానీవారిలో కట్నం ఇవ్వాలనే నిర్బంధం లేదు. ఈ విధంగా ఏవో బహుమతులు ఇస్తారు.

పెండ్లికొడుకు వారింట్లో ఎవరైనా చిన్నకుర్రాడు మొట్టమొదటిసారిగా పెండ్లిచూడ బోవుచున్నవాడున్నట్లైతే, ఆకుర్రవాని తల్లిగాని దగ్గిరబంధువులుగాని అతనికి "చేఛల్" అనే వేడుకజరుపుతారు. వారికి తెలిసిన ఆడువారందర్నీ పాటలు మొదలైనవి పాడి ఒక్కొక్క ముత్తైదువకూ మిఠాయిలూ, ఒక కొత్తగ్లాసు, వారిశక్త్యానుసారం ఒకరూపాయికి తక్కువ కాకుండా కొంతడబ్బూ పంచిపెడ్తారు. వీరు పేరంటాలకు మనలోవలె పసుపు కుంకం పంచిపెట్టడమనే రివాజులేదు.

అబ్బాయి తరఫువాళ్లు పెళ్లికి వెళ్లేటప్పుడు ముందుగానే మేమింతమందిమి వస్తున్నామని పిల్లవైపు వారికి తెలియ జేస్తారు. వీరుపెండ్లికూతురివారి ఊరుచేరగానే స్టేషనులోనే వారిని కలుసుకోడానికి పిల్లతండ్రి

మొదలైన మగవారందరూ బాజా భజంత్రీలతో కార్లుతీసుకుని ఎదురెళ్లి, పెద్ద ఊరేగింపులతో ఇంటికి తీసుకొస్తారు. దానినే "బర్సాత్" అంటారు. (కొంచెంసేపు వీరినిట్లా ఆపేసి మనం పెండ్లికూతురి సంగతికూడా కొంచెంతెలుసుకొందాం)

పెండ్లికూతురి వారింట్లో, పెండ్లికి 15 దినాలముందుగానే ఒకమంచి శుభముహూర్తముచూచి పిల్లను పెండ్లికూతుర్ని చేస్తారు. ఆరోజుమొదలు పెండ్లిరోజువరకూ ప్రతిదినమూ ఉదయమూ సాయంకాలమూ కూడా, ముత్తైదువలువచ్చి పెండ్లికూతురికి వంటినిండా నలుగులు పెట్టి, పసుపు, చందనం, ఇంకా సుగంధద్రవ్యాదులు కొన్ని ఆ అమ్మాయిమీదజల్లుతారు. ఆ అమ్మాయికి ఆ పదునైదు దినాలూ మిఠాయిలూ, పండ్లూ, పాలు, పెరుగేతప్ప ఉప్పుతో వుడికిన ఏపదార్థమూ తినడానికి పెట్టరట! ఎప్పుడైనా, తినాలంటే బహు ఇష్టంతోనూ, దానిమీద ప్రేమతోనూ తినడంగాని, ఒకపక్షమంతా (15 రోజులు) అదే ఆహారంగా చేసుకు బ్రతకాలంటే ఎవరికి మొహం మొత్తదు! ఉప్పుతింటే పసుపు వంటికి అతకదనట వారినమ్మకం. ఎంత బాగా వంటికి పసుపు అతుక్కుంటే అంత ఎక్కువకాలం సుమంగళిగా ఉంటుందని చెప్తారు. చేతినిండా మోచేతివరకూ గోరింటాకు పెడ్తారు. ఇదంతా పునిస్త్రీలక్షణం! ఆడవాళ్లందరూచేరి ఆ పిల్లమీద, పూలు, పరిమళద్రవ్యాదులూ వేస్తూ పాటలు పాడుతారు.

పెండ్లికొడుకు వారిని ఒక విడిదిలో దింపుతారు. "బరాత్"వారు పెండ్లినాడు పెండ్లిపందిట్లో వస్తూఉంటే ఇక్కడి ఆడువారంతా కనబడకుండానే పైనించీ పెండ్లికొడుకుమీద అక్షింతలూ, పేలాలు, పూలూ జల్లుతారు. లోపలనుంచే పాటలుపాడుతారు. హోమమంటపందగ్గిర పెండ్లికొడుకూ పురోహితులూ కూర్చుని ఉంటే మేనమామ మనలోవలెనే పెండ్లికూతుర్ని గౌరీపూజ దగ్గరనుంచీ లేవదీసి మంటపందగ్గరకుతీసుకువచ్చి పెండ్లికొడుక్కు ఎదురుగాకూర్చోపెడ్తాడు, బుట్టలోకూర్చోపెట్టిమాత్రం మోసుకరాడు మనలోమల్లే. ఇరువురి మధ్య తెరవెయ్యడంకాక ఇక్కడ ఇద్దరికిపైనుంచి ఒక దుప్పటికప్పి కొన్నిమంత్రాలు చదువుతాడు ఆపురోహితుడు. తలంబ్రాలుపోసుకోడంఉన్నట్లులేదుగాని ఏవోకొంచెంపేలాలు ఒకరిమీద ఒకరు జల్లుకోవడంఉంది. వీరిలోనూ మధుపర్కాలు, భాషికాలు కట్టుకోవడం కద్దే, కాని మంగళసూత్రాలు మాత్రం చూద్దామన్నా కనబడవు! పురోహితుడుమంత్రాలుకొన్ని చదివి ఒకరిచేతి ఒకరికి కంకణాలు కట్టిస్తాడు; వాళ్లకొంగులుకట్టించి సప్తప్రదక్షిణాలుచేయిస్తాడు. ఆమంటపందగర నాగవల్లి పిడతల్లాంటివికూడ పెట్టి ఏవో నవధాన్యాలు మొలిపిస్తారు. పెండ్లిమంత్రాలన్నీ మనలోమల్లేనేచెపుతారు. అందరూ ఆనూతన దంపతుల్ని ఆశీర్వదిస్తారు. వీరినిద్దర్నీలోపలగౌరీ పూజఅయినచోటుకి తీసుకెళ్లి అక్కడ అమ్మాయినోట్లో మూడుసార్లుపెరుగుపెట్టిస్తారు. అదే అప్పగింతలు లాంటిది. ఆసమయమందు పిల్లవైపు వాళ్లుకొంచెం కంటతడిపెట్టకమానరు. ఇదిదేశమంతటాఒకటే కదా! అంతట చేతికంకణాలు వీరిదివారు, వారిదివీరు విప్పుకొని, ఒకనీళ్లబిందెలోవేసి, ఇరువురూతీయబోతారు. ఎవరుముందుతీస్తే వాళ్లుగెలిచినట్లట. ఇట్లాంటిదిఏదో మనలోనూఉందనుకుంటాను. బరత్ వైపువారు(మగపెండ్లివారు) వెళ్లిపోయేముందు వీరింట్లో భోజనాలు చేస్తూన్నసమయంలో పెండ్లికూతురితరపు ఆడవాండ్లంతా మేడనుంచిగాని ప్రక్కగదిలోనుంచిగాని వీరికివినబడేటట్టుగట్టిగా హేళన వెక్కిరింపులతో మగపెండ్లివారిని తిడుతూ పాటలు పాడుతారు. దీన్ని "గాలీ" కా "గానా" అంటారు. ఇది ప్రతి పెండ్లిలోనూ తప్పక పాడుతారట. ఈ పాటలలో పెండ్లికొడుకు వారిమీద ఆక్షేపణలేచాలమట్టుకు. ఇంతటితో పెండ్లిఅయిపోతుంది. పిల్లనుసారెతో పాటుతీసుకవెళ్లిపోతారు. మరోచిత్రం విన్నారోలేదోమీరు, పిల్లవైపు దగ్గిరబంధువులుఎవరూ, ఎప్పుడూ ఆపిల్ల అత్తవారింటికివెళ్లకూడదట. ఒకవేళ చూడడానికివెళ్లినా ఆయింట్లో, అసలు ఆఊళ్లోనే, మంచినీళ్లయినా పుచ్చుకోకూడదట. ఒకవేళఖర్మంచాలకపుచ్చుకొన్నా, వాళ్లకుఏమాత్రమైనాడబ్బుముట్టచెప్పాలిట. ఇటువంటిది ఎక్కడైనాఉందా.

(సశేషము)



# కథ

టి. జి. శర్మ.

నేనంటే ప్రతివారికీ యిష్టము. ఎందుకంటే ప్రపంచంతోనే పుట్టాను. ప్రపంచమంతా నేనే నిండియున్నాను. ప్రతీవారి సంగతీ బయట పెడుతుంటాను. ఊబుసు పోవడం ఎట్లా మరి? నేనుండుచోట జనులు మూగనివారు లేరు. ఎచ్చటనైనా నన్ను చెప్పుట మొదలెట్టారంటేచాలు. వారివారిపనులు నిలుపుకొనైనా వచ్చేస్తారు. దూరమని యెంచరు. శక్తిలేనివారమే అనీ అనుకోరు, నిద్రవస్తుందనీ అనుకోరు. నన్ను అలక్ష్యంచేసి నిద్రపోయేవారుకూడా ఉన్నారులేండి. పాపము! బిడ్డలకైతే నాయందు మిక్కుటమైన ప్రీతి 'కథచెప్పవూ. కథచెప్పవూ,' అని బ్రతిమాలుతారు. కాని నాగాలి సోకగానే ఊ, కొట్టుతూ నిద్రపోతారు.

ఎందుకా నన్నిట్లు ప్రేమిస్తున్నారని ఆలోచించాను. ఆబాలగోపాలము వినుటలో నాలో యేదో మాహాత్మ్యముండితీరాలి. చూడండి! త్యాగంచెయ్యండని వెయ్యిసార్లు చెప్పినను తనదికాని దానిని కూడ అపహరిద్దామని చూస్తూ ఉంటే ఇంక తనదేమిస్తారు? నేను శిబిచక్రవర్తి స్వీయమాంసదానము, కర్ణుని వర్ణన, రంతిదేవుని నిరంతర త్యాగములు విశ్వదాత విషయము ఈలాటివి బయట పెట్టానా ప్రజల మనస్సులలో కొంతమార్పు కలుగక మానదు. 'సత్యంవద' అని వేదం. వేమరు కొట్టుకున్నా విననివారు హరిశ్చంద్రుని అపార సత్యవర్తనలు విన్న 'ఏమిరా! చక్రవర్తిగాపుట్టి, ఆలుబిడ్డలను కూడ అమ్ముకొని, చావుబ్రతుకుల్లోకూడ నిజాతప్పలేదు. ఎంతకష్టాలైన పడినాడు. ఈ కాస్తకెందుకురా అబద్ధ' మంటారు. ఇంతేకాదు. నేను గజదొంగల విజయాలను వర్ణించానా ఆయుక్తులు, ఆపన్నాగాలు విని దొంగలుగాను, దుష్టులుగాను తయారవుతారు. కనుక నేను పెట్టింది బిక్ష. క్రొత్తబట్టకు చాయ అతికినట్లు నామాట. మహానుభావులు కొందఱన్నారులేండి. వేదములు రాజాజ్ఞలట ధర్మశాస్త్రములు మిత్రతుల్యములట. నేనంటే ప్రియురాలైన భార్యనట. ఆ! జ్ఞాపకము వస్తున్నది. సుదర్శనుని కొమరులను నేనేగా సత్పథములో బెట్టి కండ్లుతెరిపించింది. నన్నుతయారు చేసిన విష్ణుశర్మ సామాన్యుడా! అప్పుడాయన కుక్కలు, నక్కలు, పిల్లులు, కాకులు నాకిచ్చాడు. నేను సాగుతుంటే అవి దేవుడాని మాట్లాడినవి. వెధవది ప్రాణం ఉండేది ఒకలెక్కా! ప్రాణము లేని ముంతా జాడీలుకూడ నేనంటే మాట్లాడుతాయి. గర్వము, బడాయి పనికిరాదని నిమిషములో తీర్మానం చేసేస్తాను.

మహర్షులనుండి వేదములలోను, ఉపనిషత్తులలోను కూడ వ్యాపించినాను. భృగువు, నాచికేతుడు వీరిసంగతి మీకెట్లా తెలిసింది? నేను చెప్పితేనేగా! నా మహాత్మ్యము తెలిసే ఆయా బోధవ్యాంశములు రుచికరముగా బెల్లములో పొదిగిన మందుమాదిరి ఉండుటకు ఆ మహర్షులట్లు అవి నారూపంగా తయారుచేశారు.

ఇంకో వ్యాసుడు నన్నుదీసుకొని పురాణములు, భారత భాగవతాదులు వ్రాశాడు. కాళిదాసు కావ్యములు, నాటకములు రచించాడు. ఎందులోను నేనులేనిది సాగలేదు. పెండ్లికూతురులేని పెండ్లియుండునా? భిత్తికలేని చిత్రరచన యుండునా? నేనులేని తర్కవ్యాకరణాదులెవరైనా తాకుతారేమో చూడండి. రసజ్ఞులెవ్వరూ ఆవైపు పోరు.

కొంతకాలానికి కొంతమార్పు కలిగింది. మొదట నేను బాల్యదశలో ఉండినాన్నమాట. నేను ఋషుల కాలంలో పసికూనవలె యథాశ్రుతంగానే పలికేదాన్ని. కావ్యకర్తలు నన్ను అలంకారాలతో నిండించి నప్పటికీ ముగ్ధత్వంలోనే ఉన్నాను. ఆకర్షణశక్తిమాత్రం ముందటికంటే ఎక్కువే కలిగింది. కానియౌవనం సంప్రాప్తంకాలేదు. వీరేశలింగముగారి కాలంలో నేను ప్రౌఢనయ్యాను. మునుపు 'అనగా ననగా ఒక రాజంటూవచ్చాను. ఇప్పుడో, అనాకొనాలేకుండా, మొదటంజలోనే 'ఏమండోయి! ఈవేళ సినీమాకెళ్దామన్నారుగా?' అంటున్నాను. సినీమాలో తారలు తమపూర్వనామధేయము ఎల్లమ్మనియో పుల్లమ్మనియో ఉంటే కమలాదేవి, శచీదేవి అనిమార్చుకున్నట్లు నేనుకూడ ఆయౌవనదశలో పలికేటప్పుడు నాపేరు 'నవలా' అని మార్చుకున్నాను. జనులకు నేనంటే నిద్రాహారాలుపనిలేదు. కంటచూస్తే చాలు. ఎత్తుకొని దించనే దించరు. వృద్ధికివచ్చే విద్యార్థులు వృథాగా నాతోనే కాలక్షేపంచేసి నన్నునలిపేస్తారనీ, తామూ చెడిపోతారనీ పెద్దలు కొందఱు నాపొత్తు పనికిరాదంటూ ఉపదేసించుతారు. ఆ వీరేశలింగగారు నేను ప్రజాబహుళ్యానికి తెలిసేటట్టు నా పద్యాలతెర తీసేశారు. వచనంగా మార్చారు.

నాటకాల్లో కూడ వయఃపరిణామమునుబట్టి నాకు మార్పుకలిగింది. పూర్వము ఒక అంకమంతా ఒకే ఘట్టమున నన్ను పడవేసేవారు. ఇప్పుడల్లాకాదు. ఒక అంకంలోనే రంగములపేరిట వివిధవిషయములు మార్చి కొంత క్రొత్తశోభ కలిగించారు. దానితో జనులు నాపైకి వచ్చి తోసుకు తిరగడం మొదలెట్టారు.

రంగస్థలంలో చేయుటకు చేతకానిది, చేతయినను వీలుకానిది, చేతయి వీలైనను సిగ్గువిడువనిది హింసానిద్రస్నాన భోజనమైథునాదులు చూపకూడదని పూర్వకాలమున నాట్యాచార్యులు సెలవిచ్చినారు. అప్పుడప్పుడు నేను విష్కంభప్రవేశకాదులలో ఊహామాత్రమున తెరచాటుననే ఉంటిని. ఇప్పుడన్ననో నిజముగా ప్రౌఢదశకువచ్చినాను. నామధ్యదశ నశించింది. సినీమాఇంటిలో అడుగుపెట్టినాను. భయమూ లజ్జా ఏదిలేదు. స్వైర విహారాలు. క్షణములో తత్స్థానే బొమ్మల సంహారాలు. లెన్సులతో విశ్వరూపదర్శనాలు. పంపులతో ప్రళయవర్షములు. మధ్య నాకేవిచ్ఛిత్తిలేదు. ఏనిషేధాలులేవు. ఏ అసాధ్యమైన పనీలేదు ఏ తెరచాటులులేవు.

నన్నింకను ఒకటిమాత్రం బాధిస్తూనేఉంది. వీధినాటకాల్లో, తమనామధేయాధికారాదులు తామే చెప్పుకొని అసందర్భముగా ఎగిరి గిరగిరతిరుగుట ఏంబాగుంటుంది? వారు ఆపద్ధతులు, ఆదుముకులాటలు వదలక, ఎప్పుడో నాచిన్నప్పుడు చేసిన ఆవ్యక్తపుపనులు, ఆపలికిన మాటలు గట్టిగపట్టుకొని, సినీమా తారనైయుండు నప్పుడుకూడ ఆవేచేస్తుంటే నాకుతలవంపులుగా నున్నాయి.

సాధారణంగా ప్రతివారికీ యౌవనదశలో బుద్ధి వికాసం కలిగి పలుపోకలుపోతుంటారు. నేనూకవుల చరిత్రగా మారాను. స్వీయచరిత్రగామారాను, భాషాచరిత్రగాను మారాను.

చిలకమర్తివద్ద చిందులుత్రొక్కి, నవ్వి, అందఱిని ఒక్కపెట్టున నవ్వించాను. పానుగంటివారి సాక్షిలో పదములపాటవము నేర్చి నాట్యమాడాను. ఇక నా చిన్నచిన్న విలాసములన్నియు మాసపత్రికలలో చూస్తూనారుగా! అయితే నాకు ఒకరిని ఎత్తిపోసేపనిమాత్రం అనకండేం! అవి నావయసుకుతగిన వ్యంగ్యచేష్టలు.

నన్ను చక్కగా మంచిగా తయారు చేయండి. ప్రజలందఱికీ అర్థమయ్యేటట్లుచేయండి. పాపము! అందరు నన్ను విని తెలుసుకొని ఆనందిస్తారు. 'పరోపకారార్థమిదం శరీర' మన్నారు. గూఢముగాను, కఠినపదములతో ప్రౌఢముగాను వ్రాసి, వారివాత మట్టికొట్టకండి. పామరులకు నేనుదర్శనమియ్యకూడదా? వారువృద్ధిలోకిరాకూడదా? వారికర్థమయ్యేలాగున వ్రాయండి. అప్పుడే మీకు నాకు పేరు. గిడుగువారియెడ నాకృతజ్ఞత విడువను. పూర్వమైతే కృతికర్తలు, కృతిభర్తలు, వినియానందించు శ్రోతలు అందఱూపండితులే. కవికిరాజాదరణముండు కాలము సాగిపోయినది. ఇప్పుడో కాలముమారినది. ఆవిక్రమార్కుడుగానీ, కృష్ణదేవరాయలుగానీ లేరు. ప్రజల మన్ననలు వడయునట్లు వ్రాసినగాని కవికి కాసురాదు. మఱొకమాట. ముఖ్యముగా మనదేశము వృద్ధికివచ్చుబాటలలో నన్నునడిపించండి; నేనందఱిని గమ్యస్థానంచేరుస్తాను. పనికిమాలినట్లు నన్ను చెడుత్రోవలపెట్టిన ఆ చెడుగే జనసామాన్యమునకు బోధించకతప్పదు. ఉరికంబమువద్ద ఉద్యోగములోకుదిరి జీవహింస నేర్చెట్లుమానుదను ?

ఇంకొకమాట. ఇది విమర్శనాయుగముసుమా! మేధావంతులు బాగోగులు గ్రహించుతారు. దూదిపింజలాగు ఏకేస్తారు. నన్నుచక్కగా అలంకరించండి. అట్లంటే ఉపమాద్యలంకారములు గుప్పించి గంగిరెద్దుమాదిరి తయారుచేయుటకాదు. అంతటితో నాకేమి శోభ. భూషణశతములు దిగవేసుకొన్న కురూపిబాలికనెంత ప్రేమింతురో నన్నూ అంతే. చైను, లోలక్కులు, రిస్టువాచి స్లిప్పర్సు వేసినడచుచక్కని నవనాగరిక పద్ధతిలో నడిపించండి. ప్రజామనస్తత్వమెఱిగి రచించాలి. ఏగాలికాచాప. ఆదూషణ భూషణాలు నాతో పోవు. నన్నుతయారుచేసిన మిమ్మూ చుట్టుకొంటాయి, కవిలోకమా! ఇక సెలవు.



# సంఘాన్ని బాగుచేసే ముఖ్యశాసనాలేవి?

శ్రీమతి పాకల. రాజామణెమ్మ గారు.

——(o)——

ఇదివరకు నిర్మించబడ్డ శాసనాలలో కొన్ని, యిప్పుడు నిర్మించబోయే చట్టాలలో ముఖ్యమైనవంతు. చట్టాలు భారతస్త్రీల కష్టాలు నివర్తించడానికి, భారతీయ కుటుంబాలలో శాంతి సౌఖ్యాలు నెలకొల్పడానికేకదా నిర్మింపబడుతున్నవి. ఈ కష్టాలన్నిటికీ మూలకారణమైన సమస్యను చక్కబరుస్తే యిచ్చట నిర్మాణావశ్యకమే యుండదు. ఆసమస్యేదంటే మనభారతీయ వివాహాలు. వరశుల్క నిర్బంధ వివాహాల వల్ల కుటుంబాలలో శాంతిలేక నరకప్రాయంగా వుంటున్నవి. వరశుల్కాని కాశపడి తల్లిదండ్రులిష్టంలేని కన్యనైనా కొడుక్కి కుదురుస్తారు. వారిమాటకెదురు చెప్పలేక "ఊ" అని పెండ్లికి సిద్ధపడి ముక్కూమూనుకొని ఆకన్యమెడలో మూడుముళ్లు వేస్తారు. యీ కాలపు యువకులు. ఆక్షణం మొదలామూడు ముళ్లూవేసిన ముక్కూమొహమెరుగని యువకుడే తనసంతోషసౌఖ్యాల కాధారమని నమ్మి మనస్సు శరీరం సంకోచంలేకుండా అతని ఆధీనంచేసి, కనిపెంచిన తల్లిదండ్రులని, తోడబుట్టులని అందరినీ విడిచి, ఆతనితోనెంతదూరమైనా వెళ్లడానికి సంతోషంతో సిద్ధపడుతుంది. విదేశనాగరికతా వ్యామోహితులైన యువకులు కొందరు విధిలేక భార్యతో కాపురంచేసి బిడ్డల్నికని యెట్లో సంసారం గడుపుతారు. కొందరు యేదోనెపంపెట్టి భార్యని వదిలిపెట్టారు. కొందరు దుర్మార్గులు ఆమెకండ్లెదుటనే వేరేస్త్రీని పెండ్లాడి హింసిస్తారు. ఇన్నీ ఆభార్య కిక్కురుమనకుండా భరించవలసిందే. వ్యతిరేకించిందా పతివ్రతకాదంటారు. ఇంకాయెన్నో నిందలామెకు సంఘంకట్టి పెడుతుంది.

అంతేగాని స్త్రీలకూ పురుషులకువలె సమస్తసౌఖ్యాలు కావలెననే కోర్కెవుంటుంది. అందరినీ వదలి మనలనే దిక్కని నమ్మినస్త్రీని మనమేగదా సుఖపెట్టవలె, అన్యాయం చెయ్యడం ధర్మమా అన్న ఆలోచన ప్రమాణాలుచేసి తాళికట్టిన పురుషుడికీ వుండదు, బలవతంగా చేసిన పెద్దలకీ వుండదు. ఆడదాని అదృష్ట మేమిచెయ్యమని తప్పుకుంటారు. నాకిష్టంలేదు తల్లిదండ్రులకొరకు చేసుకున్నానంటాడుభర్త. ఆభార్యగతి అధోగతి. ఇన్నిమాటలెందుకు.

> ప॥...... ........................కూకటుల్ కొలిచి, చేసిన కూరిమి సోమిదమ్మ సా।
> ఖ్యావహమై భజింప సుఖులై తలిదండ్రులు గూడి దేవియున్ ।
> దేవరవోలెనుండి యిలు, దీర్పగ కాపురమొప్పవానికిన్ ।

ఇలాంటి సుఖమయ సంసారాలు మనభారతదేశంలో నూటికేపదోతప్ప మిగిలినవన్ని యేదో విధమైనకష్టమయాలే. భర్తలాల్లని భార్యల కన్నీళ్లతో కడగబడేవి కొన్నియిళ్లు; తగిన కట్నాలుపెట్టి కూతుళ్లకు భర్తలను తేలేక కృశించే తలిదండ్రులుగల సంసారాలుకొన్ని; పెట్టానన్న కట్నకానుకలు పెట్టలేదని అత్తమామలు, భర్తపెట్టే రాపిళ్లు పడలేక కష్టపడే స్త్రీలుగల యిళ్లుకొన్ని, బాల్యంలో వైధవ్యము సంభవించి తండ్రియాస్తిలోగాని, భర్తయాస్తిలోగాని రవ్వంత హక్కులేక దాసివలె చాకిరీచేసు

కొంటూ జీవచ్ఛవాలలాగ దుర్భర జీవితంగడిపే విధవస్త్రీలుగల గృహాలుకొన్ని; అనుకూల దాంపత్యము లేక సదాభార్యా భర్తలు కలహించుకొంటూ దినదిన గండం నూరేండ్లాయుస్సుగా వుండేవి కొన్నియిళ్లు; దారిద్ర్యముతో, రోగాలతో బాధపడేవి కొన్నియిళ్లు. ఇలాంటి సంసారాలుగల భారతదేశం స్వేచ్ఛయెలాగు పొందుతుంది. అయితే సంతోషంగావుండే సంసారాలు లేవనికాదు. మూడువంతులవి ఒకవంతివిగా వున్నవి. పురుషులకు మాత్రమేమి సౌఖ్య మీబలవంతపు పెండ్లిండ్లవలన? ఎంత విద్యావంతుడైనా, యెంత ప్రజ్ఞావంతుడైనా, వుపన్యాస వేదికల మీద యెంతగంభీరంగా వుపన్యాసాలిచ్చినా యింటికి వచ్చేటప్పటికి యిష్టంలేనిభార్య, గృహఛిద్రాలు వీటివల్ల లోకప్రీతికి తానూ ఒకసంసారినని నిరుత్సాహంతో గడుపుతాడు. నిజమైన ప్రేమలేక సంఘధర్మాలకు కట్టుబడి నిరుత్సాహంతో సంసారంచేసే దంపతులకు పుట్టేసంతాన మెట్లావుంటుంది. ఇటువంటి బలహీనులేమి దేశాన్నుద్ధరిస్తారు.

కాబట్టి మొట్టమొదట యీకట్నపిశాచాన్ని వదిలించాలి. రెండవదీ నిర్బంధ వివాహాలు, వర్ణాంతర వివాహాలు, వరశుల్క నిరోధకశాసనాలు, బహుపత్నీ నిరోధక శాసనాలు, స్త్రీపురుషసమాన హక్కులు యిలాంటివి చట్టరూపమైతే మనసంఘంబాగు పడుతుంది. శారదాశాసనం వల్ల బాల్యవివాహా లంతరించాయి. అంతేగాని అనవసరమైన విడాకుల చట్టంవల్ల సంఘంలోని కష్టాలంతరించవుగాని మరీయెక్కు వౌతవి. స్త్రీ స్వాతంత్రంగల విదేశాలలోనే యీచట్టంవల్ల నానాతిప్పలూ కలుగుతున్నవి. ఇన్నిలోపాలుగల మనదేశంలో చెప్పనక్కరలేదు. ఇంతపెద్ద భరతఖండంలో, విద్యానాగరికత హెచ్చైన యీరోజులలో సంఘ పరిస్థితులు బాగుపడడానికి బదులు నేనుపైన వివరించిన కష్టపరిస్థితు లెక్కువైపోతున్నవి. సంఘంబాగు పడితేకదా దేశంబాగు పడుతుంది! ఇంట్లో యీగలమోతా బైట పల్లకీలమోతా అయితే దేశానికి స్వతంత్రమెలా వస్తుంది! కాబట్టి దేశనాయకులైన సోదర, సోదరీమణులారా! మనసంఘాన్ని కృశింపజేసే యీవివాహ ధర్మాలని చక్కజేసే చట్టాలు నిర్మించండి. అన్యోన్యానుకూలంతో సంతోష సౌఖ్యాలనుభవించే దాంపత్యాలు నెలకొల్పండి. ముల్లుదీసి కొఱ్ఱుగుచ్చే విడాకుల చట్టాలలాంటివి నిర్మించకండి. అన్యోన్య ప్రేమ గల దంపతుల ప్రేమఫలాలలాంటి ఆరోగ్యసంతానంతో, ప్రవరుని తల్లిదండ్రులవంటి తల్లిదండ్రుల ఆశీర్వాదాలుపొందే వుత్సాహంతో దేశసేవకు బయలుదేరే శుభదినాలు మన భారతీయుల కెప్పుడు వచ్చునో! దేశమాత అట్టి తన సంతానాన్నిచూచి ఆనందించే రోజెప్పుడో!! మనధర్మాన్ని బాగుచేయండి గాని పర ధర్మాన్ని ఆశ్రయించకండి.

శ్లో॥ స్వధర్మే నిధనం శ్రేయః। పరధర్మో భయావహః॥

అన్నాడు శ్రీకృష్ణభగవానుడు.

---




## కవిచంద్రులు, కోట సోదరకవులు, అష్టావధానులు.

శ్రీవాణీగిరిజాసతీమణుల యాశీర్వాద భాగ్యాన నా
నావైదుష్య పరంపర ప్రథితవిజ్ఞాన ప్రభాశాలివై
యావద్భారత దేశభాగముల వాహ్యాళింపరమ్మా! చిరంజీ
వత్వంబున వృద్ధిఁబొంది, గృహలక్ష్మీ! పత్రికారత్నమా!

రాజధానీ నగర ఖ్యాతిఁదనరిన మద్రాసు వీఁట సంభవముగాంచి,
నరకేసరి సనూఖ్య వగలు రసజ్ఞుని సౌధాన ముద్దు ముచ్చటలు నెఱపి
కవిచంద్ర పండితగాయకవరు లాది జ్ఞానసాగరుల మన్ననలు వడసి,
సారస్వత వినోదసత్కథాచారిత్ర లానందమైన విద్యలను నేర్చి,
తతసనాతన నూత్న భారత చిరంటు లలరి నడచిన యడుగుజాడల మెలంగి,
వచ్చు నీరాఁకమాకు శుభావహమ్ము కీర్తిదాయకము గృహలక్ష్మిలలామ!

కుతుకస్వాంతముతో స్వధర్మపరతన్ గ్రొంగ్రొత్త మార్గాల, భా
రతకాంతాభ్యుదయ ప్రయుక్తమగు కార్యారంభవౌ నీవు, హా
రతిఁగావింప, సహోదరాళి చనుదేఱన్ వీధిగుమ్మాన ని
ల్చితి మత్యంత ముదంబుతోడ గృహలక్ష్మీ! రమ్మ మాయింటికిన్.

ఒకచో ఆంధ్రసతీ ప్రవర్తన గుణోద్యోగంబు పాటించి, యిం
కొకచో కావ్యవిమర్శన ప్రకట భావోద్రేకచర్చాను చ
ర్చకళల్ రేగగ తాండవించెదవు, చిత్రాలంకృతాకారవై
సకియా భారతి పత్రికా రమణి కుత్సాహంబు రెట్టింపఁగన్.

అదె! ఆలించితి మాంధ్రమాత జయశంఖారావమున్ జేసె న
ష్టదిశా వారణ కర్ణరంధ్రములు విచ్చన్ ద్రుష్వపో, రాష్ట్రిసం
పద చేకూరుని జంబటన్న ప్రతిశబ్దంబయ్యె, మాపాల ని
త్య దయాశాలినివమ్మ! స్వాగతము గొమ్మా! పద్యపుష్పమ్ములన్.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువ కాలపరి... చందాపద్ధతిలేదు. విడికాపి రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. . బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకు ...ందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంత...యు అనువైనది. ప్రకటన ఛార్జీలు ప్రతిమాసము ముందుగనే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగల తావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయ... యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క పిరాతో స్పష్టము తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలి-వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కప్పుడు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలా బిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము

సంపు గ్రంథము...
కార్డు వ్రాసినచో

సం...

సంచికలు చేర...
మాకు తెలుపవల...
వాత చేరలేదని వ్రా...
చిరునామామార్పు...
వారికిని తిరుగ పం...
తమతమ పోస్టాఫీసు...

చిరు...



కస్తూరిబా — మహాత్ముని ధర్మపత్ని

1943 లో జైలులో దివంగతురాలైనది. ఆమె పేరట 125 లక్షలు వసూలుజేసి గ్రామబాలికలకు ఉత్తమ జీవితమునకువలయు విద్యాబుద్ధులనేర్పు సంస్థల నెలకొల్పుచున్నారు. వాటివివరములను క్రమముగానీ సంచికల ప్రకటింతుము.




నెచ్చెలీ,

కల్పలతా, ఇంచు మించు అయిదేండ్లకు తరువాత మనగృహలక్ష్మి మరల వెలువడుచున్నదను సువార్త మన ఉభయులకే గాక మన ఆంధ్రమహిళాలోకమున కంతయు నెంతయో ముదావహముగ నున్నదిసుమా! 1942 సంవత్సరము అనేక విధముల స్మరణీయ మైనది. దేశమంతయు విప్లవాత్మకమై బ్లాకౌట్లతో మిలటరీ విహారములతో దేశభక్తుల కడగండ్లతో ప్రభుత్వమువారి భీతావహ కృత్యములతో ప్రజల క్రమశిక్షణా విరహిత చర్యలతో క్షుభిత సాగర మట్టులు కల్లోలితమై యున్నది. ఆనాడు గృహ లక్ష్మి నిలిచిపోయినది. ఆంధ్ర స్త్రీలెల్లరు అది దుర్దినముగా భావించినారు. ఈ ఆయిదేండ్ల దీర్ఘకాల ములో ఆంధ్రస్త్రీలకు గృహలక్ష్మి తలపునకురాని సమయములేదు. అట్టిస్థితిలో తన అజ్ఞాత వాసము వీడి గృహలక్ష్మి పునర్దర్శన మీయనున్నదను శుభవార్త యెవరికి సంతోషకరము గాకయుండును? మిత్రమా! నిజముగా గృహలక్ష్మి ఆజ్ఞాత వాసములోనున్న యీకాలములో మనమును అజ్ఞాత వాసము చేసినటులే యున్నది సుమా!

ఈ అయిదేండ్లలో ప్రపంచమెంత మారిపోయినది! ఎన్నిచిత్ర విచిత్ర సంఘటనలు జరిగినవి! ఇట్టి చరిత్రాత్మకమైన సమయములో మహిళా హృదయము వెల్లడించుటకు గృహలక్ష్మి లేకపోయెనని యెన్ని మారులో అనుకొంటిమి. కాని వల్లమాలిన కాగితపు కఱవు వచ్చితెల్లని కాగితపుముక్క కంటికి కను పించుటే అరుదైన సమయములో గృహలక్ష్మి యెట్లు రాగలదు? సరి; గడిచిన దానికి విచారించి ప్రయోజన మేమి? యిప్పటికైన గృహలక్ష్మి రాగలిగినందుకు ఆనందింతము. ప్రస్తుత పరిస్థితులు మాత్రము అప్రాముఖ్యముకా వుగదా! ఉప్పునకు, పప్పునకు, నిప్పునకు, నీరుకు, బియ్యమునకు, కట్టెకు, పొట్టుకు, బొగ్గుకు తలచమురుకు దీపపు నూనెకు, పాలపంచదారకు, కట్టుగుడ్డకు, అన్నిటికీ కంట్రోలు, రేషనింగులుగదా! యుద్ధాత్పూర్వము ఈ ధరల నిర్ణయమునకు వస్తుపంపిణీకి యింత శాస్త్రమున్నదని కలలోనైన తలచితిమా! యుద్ధము వివిధ కష్టానుభవ ములతో బాటు వివిధ విషయకవిజ్ఞానానుభవమును గూడ కలిగించునది. ఇదియొక వింతగదా!

కల్పలతా! గమనించితివో లేదోగాని, పత్రికల కాగితపు ధర హెచ్చిపోయినది! పత్రికల ప్రాముఖ్యత గూడ నిప్పుడంతగా హెచ్చిపోయినది. వార్తాపత్రిక లిప్పుడున్నంత ఆప్యాయంగా మరెప్పుడునులేవు. ప్రస్తు తము స్వదేశ విదేశములలో జరుగుచున్న అతిప్రాముఖ్య వ్యవహారములే పత్రికలింత ప్రజాభిమానమునకు పాత్ర మగుటకు కారణము. మనభారత వర్షములో కేంద్రప్రభుత్వము రాష్ట్రప్రభుత్వము గూడ జాతీయములై మనప్రజానాయకులే ప్రభుత్వసారథులై రాజ్యము నడుపుచుండుటచేతను, దేశములోని ఆహారవస్త్ర సమస్య

లత్యంత కష్టములై యుండుట చేతను, ఏ ప్రభుత్వము ఏవిషయముపై ఏమిచేయుచున్నదో అను నాతురత ప్రజలకెక్కువైనది. ఇవియేగాక ప్రపంచదృష్టిలో భారతదేశము అత్యంత ప్రముఖస్థాన మాక్రమించునది. మిత్రరాజ్య సమితిలో విజయలక్ష్మి విజయపరంపరలు, లండను సభలలో చర్చిలు చర్చలు, జిన్నా పన్నాగములు, నెహ్రూ సింహగర్జనలు అమాత్యత్రయము అల్లిబిల్లిలు, అట్లీ అటు ఇటు మాటలు, ఒకటేమిటి అన్నియు తెలిసికొన వలసినవే. ఇరువదేండ్ల తన అహింసా ప్రబోధము అసమాన కృషి, అసదృశ తపస్సు లీగుప్రభుత్వముచే కలుషితమై బెంగాలులో రక్త ప్రవంతుల ప్రవహింపజేయగా పరితప్తమానసుడైన మహాత్మా గాంధీ ఆ వంగ రాష్ట్రమునందలి నౌఖాలీ జిల్లాలో మారుమూల గ్రామాదులలో అనుచరవిరహితుడై ఏకాకిగా హిందుమహమ్మదీయ సఖ్యత అనే అమృతఫలము నెక్కడ పొందగలనా యని యిల్లిల్లు తిరుగుచున్నాడు. పల్లెపల్లెకు నడిచి పోవుచున్నాడు. ఇంతకటికిచీకటులు నన్నెప్పుడూ వరించ లేదనుచున్నాడు. అయినను ఆశపోలేదనుచున్నాడు. ఈ అహింసా యోగక్షేమము లెప్పుడప్పుడు తెలుసుకో వలసినవిగదా!

ఢిల్లీలో ప్రజాపరిషత్తు ప్రారంభమైనది. లీగుసభ్యులు కలిసి రాక భీష్మించుకొని కూర్చున్నారు. మిత్రభేదమునకై బి. సి. సెక్షనులుగా విభజింప బడిన రాష్ట్రములు తమస్వాతంత్ర్యమును చంపుకొని యీ వర్గములలో నుండుట కంగీకరించుటలేదు. మనసులో నున్నదొకటి, కాగితములో వ్రాయునదొకటి, క్రియలో చేయునదొకటి అను పద్ధతి కలవాటు పడిన బ్రిటిషురాజ్యతంత్రజ్ఞులు ఈ ప్రజా పరిషత్తు సవ్యమార్గమున పోకుండుటకు అడ్డుపుల్లలు వేయుచున్నారు. అయినను ప్రజాపరిషత్తు సమావేశమగుటయు, ఆయాశాఖా విషయమున ఉపసంఘము లేర్పడుటయు జరిగినవి. వానిలో ఒక ఉపసంఘమున మన దుర్గాబాయిగారు కూడ ఒకసభ్యురాలుగా నుండుట మనము సంతసింప వలసిన విషయము.

మద్రాసురాష్ట్ర పరిపాలనలో శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతిగారు ఆరోగ్యశాఖా మంత్రిణిగా నుండుటయు, అమ్మన్నరాజాగారు అసెంబ్లీ ఉపాధ్యక్షురాలుగా నుండుటయు, సీతా మహాలక్ష్మమ్మగారు సభ్యురాలై స్త్రీలకు హితమైన బిల్లులు పెట్టుటకు ప్రయత్నించుటయు ఆంధ్రమహిళల పురోభివృద్ధిని సూచించుచున్నదని చెప్పవచ్చును./ ఇవన్నియు పత్రికాముఖముననేగదా మనము తెలుసుకొన వలయును. అంతియేగాదు. ఇంట్లోతిండి గింజలు వండిపెట్టడమేగాదు గదా ఇప్పటిమన గృహలక్ష్ములపని. మన ప్రధానిగారు దినబత్తేమేమైనా హెచ్చిస్తారా? పప్పుగింజలేమైనాసప్లై అవుతాయా? పంచదారకు, నిప్పుపెట్టెలకు కిరసనాయిలకు పరుగులు వేసేబాధ ఎప్పుడు పోతుంది? మిల్లుబట్టలేమైనా విరివిగా యిస్తారా? మిన్నంటిన యీ నేతగుడ్డల ధర ఎప్పుడుతగ్గుతుంది? కొబ్బరినూనెకు కంట్రోలు పెడ్తారంటున్నారే ఎప్పుడు పెట్టుతారు? పెట్టగానే ఊళ్లోనూనె మాయమైపోతుందే? ఏమిదారి వెంటనే రేషనింగు గూడా పెడ్తారా?

నూలు వడికితే గుడ్డల కరువు పోతుందంటారే; కావలసినన్ని రాట్నాలు సప్లైకానప్పుడు వడుకు నూలు ఉత్పత్తి ఎట్లాజరుగుతుంది? గుడ్డ కాకపోతె మానె. ఈరాటాలే చవకధరలకు సప్లైచేస్తే బాగుండునే. ఇందులకు రాష్ట్రప్రభుత్వము వారు చేస్తున్నపనియేమిటి? ఇవన్నియు ఈనాడు పత్రికల వల్లనే తెలుసుకొన వలయునుగదా! ఈవిషయములను గురించి మన మహిళల అభిప్రాయము ప్రస్ఫుటమగుటకు పత్రికలను మించిన సాధనయేమిగలదు? కాన గృహలక్ష్మి పునరాగమన సందర్భము కూడ ప్రాముఖ్యమైనదిగానేయున్నది. గృహలక్ష్మికి స్వాగతము; సుస్వాగతము.

భావపురి. )
1 - 1 - 47 }

మిత్రురాలు,
శారద.

# బ్రతుకు తెరువు

## గృహలక్ష్మి పరిశ్రమలు.

——:(o):——

స్త్రీలు తమ ఇంటివద్దనే ఉండి కొన్ని వస్తువులు తయారుచేస్తే తామువాడుకోడానికి ఇతరులకు విక్రయించి ధనం సంపాదించడానికీకూడా వీలౌతుంది. కాబట్టి అట్టిబ్రతుకు తెరువును చూపించే కొన్ని సులభమైన గృహపరిశ్రమలుగురించి ప్రతిమాసం ఈపత్రికలో వ్రాయబడుతూ ఉంటుంది.

మనదంతాలు శుభ్రముగా ఉంటేనే ఆరోగ్యంకూడాచాలబాగుంటుంది. కాబట్టి దంతాల్ని పరిశుభ్రంచేసుకోవాలి. వాటిమీదఉండే ఎనామిల్ (Enamel) అనేమెరుగు పోకుండా తోముకోవాలి. ఆఎనామిల్ అరిగిపోయిందంటే దంతాలతాలూకు పటుత్వం తప్పిపోయి చీమునెత్తురుతోకూడిన వ్యాధులుసంభవిస్తాయి. గనుక మనందంతధావనకు వుపయోగించే చూర్ణాలు చాలామంచివిగాఉండాలి. మనదేశంలో కొందరుఇటికపొడితోటి ఇసుకతోటి తోముకొంటారు. ఇందువల్ల మెరుగుపోయివ్యాధులువస్తూఉంటాయి. కాబట్టి ఈక్రిందచెప్పినట్లు దంతధావనచూర్ణాలుఇండ్లలో స్వంతంగా తయారుచేసుకొని వాడుకోవడంమంచిది. తీరిక సమయాల్లో విరివిగా తయారుచేసి వ్యాపారంకూడాచెయ్యవచ్చు.

ముఖ్యంగా దంతధావనచూర్ణాలు తయారుచేయాలంటే వడ్లపొట్టు బొగ్గు, సీమసున్నం, చేపసురుగు, బలపురాతిపొడి, రాతిచిప్పలుచేసే రాతిపొడి, (Soap stone Powder) వాడుతారు. దీనిలో ఇంకా కొన్ని ఔషధాలుకూడా కలిపి మెత్తనిపొడి చేస్తారు.

(ఈసంచికలో నల్ల—తెల్ల—రోజారంగుల్లో ఉండే చూర్ణాలనుగురించి వ్రాస్తాను.)

### ఓమంపల్లుపొడి

| | | |
|---|---|---|
| వడ్లపొట్టుబొగ్గు. | 20 | తులములు |
| ఓమంపొడి. | 10 | ,, |
| తెల్లఉప్పు. (Table salt) | 10 | ,, |

ఇందులోవడ్లపొట్టును ఇనపభాండంలో వేసి, నల్లగాబొగ్గుచేసి దంచిపొడిచేసి సన్నతీగజల్లెడతో జల్లించాలి. ఓమంకూడా దంచిజల్లించాలి. తెల్లఉప్పు (table salt)అంగడిలోదొరుకుతుంది. లేదా మనంవాడుకొనేతెల్లవుప్పు నాసరే దంచి పొడిచేసుకోవచ్చును పైమూడుపొడులను బాగాకలిపి వేసి తిరిగి మూడుపర్యాయాలు జల్లించాలి. కడపటకల్వంలో వేసి మెత్తగానూర్చాలి. అది డబ్బాల్లోనో, సీసాల్లోనో, పోసుకొని రోజూ ఉపయోగిస్తే దంతాలు చాల చక్కగా ఉంటాయి. మనంకలిపిన బొగ్గువల్ల నోటి దుర్వాసన పోతుంది. ఓమంవల్ల క్రిములు నశిస్తాయి. ఉప్పునోటిని శుభ్రపరుస్తుంది. ఓమములోనుంచే థైమాల్ (Thymal) అనే క్రిమినాశనం చేసేఔషధిని ఇంగ్లీషువైద్యులు తయారుచేసి అనేకమందుల్లోవాడుతారు. అమెరికావారు కేవలం ఉప్పునే పండ్లపొడిగా వాడుతారు. వస్తువుల్ని శుభ్రపరచడానికి ఇంగ్లీషువారు బొగ్గును విరివిగావాడుతారు.

## కర్పూరము పల్లుపొడి

| | |
|---|---|
| శుద్ధిచేసిన సీమసున్నము | 9 తులములు |
| కర్పూరము | 1 తులం |

ఇది ఫ్రెంచి దేశపు పల్లుపొడి. కర్పూరము కల్వములో వేసి మెత్తగపొడిజేసి సీమసున్నములో కలిపి నాలుగైదు పర్యాయములు తీగజల్లెడతో జల్లించి పిమ్మట కల్వములో వేసి మెత్తగానూరి బుడ్డిలో వేసి కార్కు పెట్టి, ప్రతిదినము వాడవలెను.

## రోజా పల్లుపొడి

| | |
|---|---|
| సీమసున్నము | 20 తులములు |
| చేపనురుగు | 20 ,, |
| తెల్లచక్కెర | 10 ,, |
| రోజారంగుపొడి (Carmine) | 5 గురిగింజలెత్తు |
| రోజా అత్తరు | 10 బొట్లు |

శుద్ధిచేసిన సీమసున్నమును, చేపనురుగుపొడి కలిపి రెండుమూడు పర్యాయములు తీగజల్లెడతో జల్లించి కొద్దిగ కల్వమునందుంచి రోజారంగును పొడిలో వేసి కలియ నూరవలయును. నూరినపొడిని మిగతా పొడిలోవేసి మరల 4 పర్యాయములు జల్లించవలయును.

# మన కర్తవ్యము

శ్రీమతి అల్లాడి అన్నపూర్ణ గారు

మనదేశములో రాజకీయముగానైతేనేమి, ఆర్థికముగానైతేనేమి, సాంఘికముగానైతేనేమి ఎన్నియోమార్పులు వెంటవెంటనే జరుగవలసియున్నవి. మనమిప్పుడు అతి క్లిష్టపరిస్థితిలో ఉన్నాము. ఈ పరిస్థితిని ఎదుర్కొనగల్గుటకు మనము మొదట జ్ఞానమును సంపాదింపవలెను. ప్రతిస్త్రీ ప్రతిపురుషుడు మనదేశము ఎట్లు బాగుపడగల్గును, మనప్రాచీనసాంప్రదాయమేమి, మనవిద్య ఏమిటి, మనము ఎట్లు విద్యను అభ్యసించిన ఈ సమయములో దేశములోని సమస్యలను ఎదుర్కొనగలము అను విషయములను తెలుసుకొనవలసియున్నది.

గీతలో శ్రీ కృష్ణభగవానుడు 'యదాయదాహి ధర్మస్యగ్లానిర్భవతిభారత' అన్నారు. ధర్మమనగానేమి? జాతిధర్మమా? మతధర్మమా? పురుషధర్మమా? స్త్రీ ధర్మమా? ఈ ధర్మము' అనుదానికి సరియైన అర్థమును తెలియవలసియున్నది. ఈ కాలము ననుసరించి మానవధర్మమేమిటి అని గుర్తింపవలయును. ప్రతివ్యక్తికూడ పశువులవలె ప్రవర్తించకూడదు.

మానవులమైన మనకు మిగిలిన పశువులు, పక్షులు మొదలైన జంతుజాలమునకు భేదముగలదు; భేదము కనుబడవలెను. అవి భోజనము చేయుచున్నవి. తమకుతగిన ఇండ్లను చూచుకొనుచున్నవి. పిల్లలనుకని పెంచుచున్నవి. మనముకూడ అదేపని మాత్రము చేసిన లాభమేమి? మనము నిజముగా మానవులమని అనిపించుకొనుటకు తగిన విద్యను అభ్యసింపవలెను. ప్రస్తుతము ఉండు అటుకొటు విద్యకాదు. పూర్వము ప్రహ్లాదుడు, కచుడు మొదలైనవారు ఎట్టి విద్యను నేర్చిరో అట్టివిద్యను అభ్యసింపవలెను. ఏవిద్య ఇహమునందు పరమునందుకూడ ఉపయోగపడునో, ఏదిసరియైన మానవధర్మమును నేర్పించుచున్నదో అదియే సరియైన విద్య. ఈకాలములో పాఠశాలలలోనేర్పు హిస్టరీ, జాగ్రఫీ, సైన్సు మొదలైనవి గుమాస్తాలను తయారుచేయుటకుమాత్రమే పనికివచ్చుచున్నవి. ఆ గుమాస్తాగిరీలుకూడ అందఱికీ వచ్చుటకూడలేదుకదా!

మనప్రాచీన గ్రంథములను ప్రతివారును అందులో ముఖ్యముగా స్త్రీలు చదువవలసియున్నది. పూర్వము రామాయణము భారతము భాగవతము చదువగా మనవారు సంపూర్ణజ్ఞానమును పొందుచుండిరి, అందులో ప్రత్యేకత అవసరమైన రాజకుమారులు మొదలుగా చతుష్షష్ఠికళలను అభ్యసించుచుండి పరిపక్వమును పొందుచుండిరి. సామాన్యముగా అందఱును భారతరామాయణభాగవతములను ఎఱిగియేయుండిరి. రామాయణములో కేవలము భగవంతుడే మానవుడుగా జన్మించి సామాన్యజనులు ఏవిధముగ ప్రవర్తించవలెనో, తాను ఆచరించి చూపించెను. తండ్రిపట్ల కుమారుని వర్తనము ఏవిధముగ ఉండవలెనో కుమారునిపట్ల తండ్రివైఖరి ఏ విధముగనుండవలెనో, భార్య భర్తపట్లఏలాగు చరించవలెనో, భర్తభార్యవిషయమై ఏలాగునడువవలెనో, సేవకుడు యజమానునికి ఎట్లు పరిచర్య చేయవలెనో, యజమానుడు సేవకుని ఎట్లుపాలింపవలయునో, ఈవిధముగా ప్రతివ్యక్తియు ఒకరితో నింకొకరు ఎట్లు మెలగవలసినదియు భగవంతునిస్వకీయ ఆచరణమూలముగనే రామాయణమున బోధింపబడియున్నది. ఇట్లేభారతమున రాజనీతిసాంఘిక ప్రవర్తన దండనీతిమొదలుగా నాటి ఆచారమర్యాదలు వర్ణింపబడియున్నవి.

కాబట్టి మనము ప్రాచీనగ్రంథములను చదువుటవలన మిక్కిలి జ్ఞానమునుసంపాదించుటకు వీలుఏర్పడుచున్నది. ఈకాలమున మనవిద్యాప్రణాళికలలో వీనికితగిన స్థానము కనబడుటలేదు. మన విద్యావిధానములో ఉన్నముఖ్యలోపమేఇది. ఇదియుకాకుండ మన సంగతితప్ప మిగిలినవానినన్నింటిని తెలియుటకు చాల అవకాశములు మాత్రమే మన విద్యావిధానములో ఉన్నవి. అందువలన ప్రాయికముగా పురుషులైనను స్త్రీలైనను మన మతగ్రంథములేమి, శాస్త్రపుస్తకములేమి వీనిని బాగుగా తెలిసియుండ వలసిన అవసరము ఏర్పడినది.

హిందూధర్మమును తెలియనిహిందువులు నామమాత్రమునకే. మనవారికిని ఎవరినైనను మనమతగ్రంథములను గుఱించిగాని మన ఆచారవ్యవహారములను గుఱించికాని అడిగిన సరియైన ప్రత్యుత్తరమును ఇయ్యలేకపోవుచున్నారు! అంత ఎందులకు? డిగ్రీ పరీక్ష ప్యాసయిన తెలుగువానిని పురాణగాథనొకదానిని అడిగిన దానివిషయము తనకు ఎఱుకలేదనిచెప్పును! ఆంధ్రులరాజ్యవైభవము వారినాగరికత ఇవి అసలే తెలియవని చెప్పవలెనా? అందుచే ఇట్టి జడప్రాయులను తయారుచేసే విధ్యావిదానముకలిగె స్వవిష

యమును తెలియజేయుపద్ధతి ఎంతయో మేలుకలిగించును. ఈ పరిస్థితిని తెలిసియే శ్రీవిశ్వనాథసత్యనారాయణకవిగారు తమభాషావాచకములలో భాగవతము మొదలుగాగల ఉద్గ్రంథములోని కథలనే పాఠ్యములుగ వ్రాసియున్నారు. ఇప్పటి మనదుస్థితికి కారణము మనప్రాచీన సాంప్రదాయములను గుర్తెఱుగకుండ ఉండుటయే. ఈపరిస్థితి మాఱుటకు ముఖ్యముగా పురుషులుకాకపోయినను స్త్రీలైనను మనప్రాచీనగ్రంథములను బాగుగ చదువునట్లు చేయవలెను. ఇందువలన తరతరములకును మననాగరికత మనతత్వము ఆచారమునశింపకుండపోవును.

ఏ పరిణామముకల్గుటకును మాతృమూలముగ మిక్కిలిసులభము. ఇది జగద్విదితమైన విషయము. హైందవసామ్రాజ్య స్థాపకుడై హైందవలోకమునకు దృఢనక్షత్రమై వెలసిన ఛత్రపతి శివాజీ మహారాజు తనతల్లియైన జిజియాబాయి యొద్ద వినిన రామాయణ భారతగ్రంథములవలననే అంతటిమహనీయుడైనది. మనదేశ స్వాతంత్ర్యమునకై అన్నిటిని త్యజించిన మహాత్మాగాంధీజీ రామనామ మహిమపై అంతటి విశ్వాసము కలిగియుండుటకు వారిమాతృదేవియే కారణము అనపచ్చును.

బాల్యప్రాయమువనే ఈఅభిప్రాయములు పురుషులలోకాని స్త్రీలలోకాని నాటవలెను. చిన్ననాటివ్రాలు శిలమీఁది వ్రాలుకదా! ఒక మతవిషయమునకేకాదు. మన ఆచారవ్యవహారములలోని విశిష్టత, మనపరకుగలపుట్టుపూర్వోత్తరాలు, వానిఉద్దేశ్యము, మనఆర్థికపద్ధతి, ప్రాచీనరాజ్యాంగపద్ధతి - ఇట్లు అన్ని విషయములను నేర్చుకొనవలసి యున్నది. మనప్రస్తుతధర్మము కర్తవ్యము మనహైందవవిజ్ఞానమును నశింపనీయక ప్రోది చేయుటయే అని చాటవలసియున్నది.






ఒకనాడు మద్రాసు వైద్యకళాశాలవిద్యార్థులను డాక్టరుగారు క్లాసు విద్యార్థులను అందరిని సులభముగ లభించు మంచిమందు యేదనిప్రశ్నించెను క్లాసులో యుండువిద్యార్థులు వకరు ఆపిలుపండు, మరియొకడు మామిడి పండని యింకొకడు పనసపండని యిలా ఒక్కొక్కరు వారికి తోచినపండ్లనుచెప్పసాగిరి అందరిని చెప్పనిచ్చినపిమ్మట—డాక్టరు గారు అందరికి సులభముగ లభించునదియు ఆరోగ్యమునకు ముఖ్యమైనదియున్న ధనికులును దరిద్రులు తప్పక దినమువాడుకొనునది శ్రేష్టమైనపండుచింతపండనెను. గనుకయిటువంటిచింతపండును ప్రతిదినమును భోజనపదార్థములలో వాడుకొని భుజించుటయేగాక ఔషధములను గూడ తయారుచేసి యింటిలోవాడుకొనవచ్చును.

కొన్ని చింతపండు కలియుయోగములను యిందు వ్రాయుచున్నాను

సుఖవిరేచనమునకు :—

| | | | |
|---|---|---|---|
| చింతపండు (విత్తుతీసినది) | ... | 1 | ఔన్సు |
| ఖర్జూరపుకాయలు | ... | 1 | ,, |
| నీళ్లు | ... | 24 | ,, |

ఈమూటిని చేర్చివాల్గవ భాగము మిగులునటుల కాచివడియబోసిపుచ్చుకొనినసుఖవిరేచనమగును.

అజీర్ణమునకు; వేడితగ్గుటకు.

| | | | |
|---|---|---|---|
| చింతపండు | ... | 1 | ఔన్సు. |
| నీళ్లు | ... | 20 | ,, |
| లవంగములపొడి | ... | 1 | డ్రాము |
| ఏలకులపొడి | ... | 1 | ,, |
| కర్పూరము | ... | 3 | ,, |

మొదటచింతపండునునీళ్లలోనానవేసి పిసికి వడియకట్టి దానిలోతక్కినవాటిని పొడిచేసి కలిపి త్రాగిన అజీర్ణము పోయి ఆకలికలుగును చలువచేయును. ఎండదెబ్బకు మంచి పానకము దీనినివైద్యులు ఆమ్లికపానము అనెదరు.

విరేచనమునకు:-

| | | |
|---|---|---|
| చింతపండు | 1 | భాగము |
| నేలతంగేడు ఆకుపొడి | ½ | ,, |

ఈ రెంటిని రోటిలోవేసి లేహపక్వమగునటుల దంచి బుడ్డిలోపెట్టుకొనవలయును. తడవకు ఒకతులము సేవించిన చక్కగవిరేచనమగును. పైలేహ్యములో రోజామొగ్గలనుకూడా వేసిదంచినమంచిది.

బెణుకునకు, వాపునకు:- చింతపండు సున్నమును కలిపి కట్టుకట్టుట మన పురాతన గృహవైద్యము. ఈ రెంటి చేరికవలన నదివేడెక్కును. ఆవేడివలన బెణుకువాపు తగ్గును. ఈలాటి జబ్బులకు ఆంగ్ల వైద్యులు టించర్ ఐయోడిన్ పైనపూసెదరు. చింతపండులో అయోడిన్ వున్నదని వైద్యులు చెప్పుచున్నారు. అయోడిన్ చిన్నమోతాదు లోపలికి పుచ్చుకొనిన అనేక రుగ్మతలు నివారించునని కూడ చెప్పెదరు. గనుక మనము ప్రతిదినము చింతపండును భోజనపదార్థములలో వాడినందున తప్పులేదు. కొందరు చింతపండు రక్తదోషమును కలిగించునని చెప్పెదరు. అట్లుచెప్పుట తప్పు. త్రిదోషహరమునకు చింతపండును యూనాని వైద్యులు విరివిగ వాడెదరు. పాతచింతపండు తరతరములనాటిదివాడుకొనుటకు శ్రేష్టమైనది. ఉగాది పండగకు తొలిఫలము చింతపండు. తొలిపుష్పము వేపపువ్వు ఈనాడు ఆంధ్రులందరు నింబప్రసాదము సేవించుటలో అర్థములేకపోలేదు. ఆయురారోగ్యైశ్వర్యములతో క్రొత్తసంవత్సరమును గడపవలెననే అర్థము :- మరియు సుఖదుఃఖములు రెండునుఅనుభవించదగినవనికూడ అంతరార్థము. అనగా క్రొత్త చింతపండు మంచితీపి రుచిగనుండును. వేపపువ్వు చేదుగను రుచిలేనిదిగనుండును. ఈ రెండిటిచేరికయే మానవుని జీవితము. చింతవిత్తులపై బెరడు తీసిపొడిచేసి సేవించిన రక్తం బంకవిరేచనములు కట్టును. చింతవిత్తుల అంబలి (రాగిసంకటిమాదిరి) తయారుచేసి గడ్డలకుకట్టిన గడ్డలు త్వరగపగిలి చీముపెడలును. చింతపండు నీళ్లతో పుక్కిలించిన నోరుపుండు మానును. చింతవిత్తనముల చూర్ణమును అతిమూత్ర వ్యాధికి స్త్రీల, కుసుమ తెల్లబట్ట వ్యాధులకు వాడెదరు. చింతపండు నుండియే టార్ టారిక్ (Tartaric acid) ను తయారుచేసి ఆంగ్లవైద్యులు తమవైద్యమున విరివిగ వాడుచున్నారు. గృహవైద్యమనిన ఇంటిలో యుండు భోజన పదార్థములతోను పెరటిలో యుండుకాయకూరలతోను ఔషధములను తయారు చేసుకొని రోగవిముక్తులగుట- ఇందుకు కొన్ని దృష్టాంతములు.

ఆకలి,ఆజీర్ణము:- శొంటి, ధనియాలు, జీలకఱ్ఱ యీమూడింటిని క్రమవిధమున గోరువెచ్చగా వేయించి చూర్ణించి సన్నని జల్లెడతో జల్లించి యింకను అవసరమయితే వస్త్రకాళితము బట్టిసరిసమానముగ మనమువాడుకొనుచుండులవణమును గాని సైంధవలవణమునుగాని మెత్తగా కల్వములో నూరి ప్రతీరోజు భోజనానంతరము సుమారు 2 అణాలయెత్తు చూర్ణమును నోటిలోవేసుకొని కొంచెము మంచినీరు గాని, పలచని మజ్జిగగాని పుచ్చుకొన్న జీర్ణమగుటయేగాక అగ్నిమాంద్యము, మలబద్ధకమువల్ల కలిగిన నీరసమును పాలుమాలికను పారద్రోలి అరుచిని పోగొట్టి నిత్యానందము చేకూర్చగలదివ్య యోగముగాన ప్రతివారును సులభముగ తయారొనర్చుకొని వాడుకొనుట శ్రేష్టము.

# సైరంధ్రి

(పద్యకావ్యము)

శ్రీమతి గంటి కృష్ణవేణమ్మగారు, ప్రొద్దుటూరు

కురుకులము రాచవారలకు తలమాని
కమ్ములై నేల నేలు భాగ్యమ్ము తోడ
తెలిగొడుగు నీడ వసియింప వలసినట్టి
దొరలు పరసేవ సేయుచు నెరియు ప్రొద్దు.

నల్లనల్లన నడయాడు పిల్లగాలి
దిశలయందు ప్రశాంతత దెలుపుచుండె,
మింట చుక్కలలో రాజు మెఱయుచుండె,
అంత నేకాంత మొకకాంత యటకుఁ జేరె.

నడురేయి దిక్కులెల్లను
కడు మౌనము దాల్చి యుండె; క్రమత బ్రకృతియుఁ
విడువక సేయుచు నుండెను (?)
పడతియొకతె తనకుఁదాన పలుకుచు నుండెఁ.

ఉపవన పద్మాకరోర్మికా తతులకు
శీతకరుఁడు వెండిపూఁత పూయ,
వెండిపూఁత బెడంగు వింత సోయగములఁ
దరువులు నిలువెల్ల విరిసి వెలయ,
మలసిన యలయిక దొలఁగ సమీరుండు
చిరముగా నిలిచి నిద్రించు చుండ,

మత్స్యభూమీశ హర్మ్యతలంబులు
ప్రశాంతముగ నిల్చికొని మౌనముద్రనూన,

ప్రకృతి చిత్రార్పితంబైన పగిది దోప
రాజశుద్ధాంతమున నిద్ర రాక నాశ
నాశ ముద్రేకమున బొంగ నారి యొకతె
బోనులోపలి పులియట్లు ప్రొద్దుపుచ్చె.

అరయ ప్రశాంతమౌ సమయ మన్ని చరాచరముల్ సుషుప్తిచే
పరలుచు నుండ నొక్కసతి వాల్పదు బట్టునకైన రెప్పలన్
గురుతుగఁ నాకసంబు దెసగూర్చిన దృష్టిమరల్ప బోదు యీ
తరుణి మనం బశాంతతను దాల్పగ కారణ మెట్టిదోకదా!

అగ్ని హృదయములో మండునట్లు దోప
కన్ను లరుణంబులై ప్రగాలు చుండె
మానవతులగు సతు లపమానమునకు
ఓర్తురే జీవములు వీడఁనోర్తురిగాని.

మనుజుఁ డేకాకియై దాను మసలుచున్న
మన సదెప్పుడు దాల్పదు మౌనముద్ర;
తనకు దా జెప్పికొను; విను తానె మఱల;
అనృతమాడదు మానస మట్టిపట్ల.

అనలమునందు బుట్టిన మహామహిమాన్విత ధీరచిత్త శో
భనగుణమాలికాభరణ పాండుతనూభవధర్మపత్ని నె
మ్మనమున యీసు, రోస, మభిమానము విహ్వలభావముల్ బెనన్
గొన దలపోసెఁ బాణితల కుంచిత కోమల గండభాగమై.

మన మెరియించు నావగపు మాధవుతో మును విన్నవింప నా
ఘనుడును జేర్మి నాయెడద కాకల నర్జను తీవ్రబాణవృ

ష్టిని ధృతరాష్ట్రసంతతి నశించుట తథ్య మటంచు బల్కె; కృ
ష్ణునివచనంబు రిత్తయగునో, అగునో గమనింపగావలెన్

రాజు ప్రజామహీవలయ రక్షక; డంతియ గాని స్వేచ్ఛగా
నోజ సెడంగ భూతలము నొడ్డగవచ్చునె? యొడ్డెబో; మహా
తేజులు తమ్ములున్ నయవిధిజ్ఞులు పెద్దలు కూడఁ గాదనం
గాఁ జనదే? యమాయక జగంబున ధర్మములిట్లు సెల్లునే ?

పూజ్య సామ్రాజ్యరమ వీరభోజ్య మగును
గాని శాంతమూర్తుల దెస గాంచ దనుచు
ద్వైతవనమున మున్నె నే ధర్మవిధుల
దెలిపితిని; ధర్మతనయుండు గలగడయ్యె.

రాజ్య మడిగిన నొసగెడి రాజుగలడె?
గెలువ వలెగాక శౌర్యంబు గలుగు నేని.
పారుల విధాన భిక్షాన్న పాత్ర గొనుచు
ఎన్ని దినములు గడుప పీ రెంచి నారొ?

(ప శేషము)






## శ్రీమతి మైదవోలు పద్మావతమ్మగారు.

దాంపత్య జీవితాన్ని గడపడం మాటలుకావు. అదివొకకళ. సంసారము సాగించుటకు, సహనము నేర్పు ముఖ్యావశ్యకములు. ఇదిసీతా, సావిత్రి మొదలగు వారియుగముకాదు. ఇది నాగరికతా వ్యామోహమున స్వతంత్రదాహములో మునిగియుండు యుగము. భార్య భర్తా, ప్రేమమొదలగు విషయముల నూతనాదర్శములతో నిండియుండు రోజులు. అట్లున్నను, పురుషధర్మములు, స్త్రీధర్మములన్నవి ఈరోజులలోను యున్నవి. కానిఅవి పురాతన ధర్మముల వంటివి కాక ఈకాలమునకు తగినట్లు నూతనమైనవి, ఈధర్మముల ననుసరించిననే దాంపత్యజీవితము, హాయిగను, అనాయాసముగ గడుపవచ్చును.

దాంపత్య జీవిత మొకకళ యనిపైననేచెప్పాను. అది యొకకళ యని ఎరుగకయే ఆనంద మనుభవించు వారనేకులు. కళయని ఎరిగి, దానికై పడరాని పాట్లుపడి పొందలేనివారు పలువురు. కోరుటేకాని ఎట్లు సాధింపవచ్చునని ఆలోచింపనివారు కొందరు. ఎట్లునడుచుకొన్న సౌఖ్యము లభ్యపడునని యాలోచించి కనుగొనినడుచుకొను వారును ఉన్నారు.

బాల, బాలికలకు చిన్నవయసున వారిభవిష్యత్ జీవితములో ఎన్నియో కావలయునని కోరుచుందురు. ఆచిన్ని హృదయములలో ఎన్నియో కోర్కెలుదయించును. కాని ఈకోర్కెలు, సర్వసామాన్యముగ అందరివి గొంతెమ్మ కోరికలే యగుచుండును. ఫలించుటే భాగ్యశాలికో! అట్టిభాగ్యశాలు లరుదు. కాని పూర్తిగ గొంతెమ్మ కోర్కెకాక చిరతప్రాయమున జనించిన కోర్కెల వ్రేళ్లతో భేదించక, కొంతకు కొంతఫలించునట్లు చేయుట, భార్యాభర్తల కిరువురికిని ధర్మము. అట్లుజరుపుటంత కష్టము కూడాకాదు.

ఎట్లుభార్యాభర్తలు, వొకరి మనోభావమును మరొకరు కనుగొనగలరను సమస్యను విడదీయుటకు కొన్ని ఉపాయములను అనుభవశాలులు సూచించి యున్నారు. వాటిలో కొన్నిటిని ఈదిగువ తెల్పెదను.

ఇంటికి కావలసిన వస్తువులు, అనగా భోజనసామగ్రి. అలంకారవస్తువులు గృహమునకు, గృహలక్ష్మికి సంబంధించిన వస్తువుల, ఏరి, ఎంచువిషయము పూర్తిగా నీ ఇల్లాలికే వదలిపెట్టవద్దు. అట్లుచేసిన అక్కరలేని కాపురమని ఆవిడదుఃఖపడును. కనుక నీవును ఆవిషయములలో తగినశ్రద్ధ తీసుకొనవలెను.

నీవు నీ ఇల్లు ధర్మసత్రమువలెను, నీ భార్య ఆయింటిదాసి వలెను తలచుట గొప్పతప్పు.

ఆవిడ ఏచిన్నవస్తువు కావలెనన్నా ఆఖరుకు పులుసురాచ్చిప్ప అయినా సరే, కావలిస్తే కొనుక్కోరాదా, నాతో చెప్పడం ఎందుకూ, యనక ఈవేళ బజారుకు పోదామూ, నీకెలాంటిది కావాలో నాకు తెలియదే నీవురా ఇద్దరం కలసివెళ్లి కొనుక్కొద్దామంటే ఆవిడ ఎంతవుప్పొంగుతుందో తెలుసా!

ఆవిడ వస్తువులేకాదు, నీకే కుర్చీ, బల్లో కావలెనన్నా ఆవిడను తీసుకెళ్లి ఆవిడ సలహా కూడా పుచ్చుకో.

ఇల్లు శుభ్రముగ వుంచుకొనుట, శుభ్రముచేయుట, తీసినవస్తువు మరలతీసినచోటవుంచుట కొంచెము విసుగుజనించుపనులే.

బట్టపాతసవరించుట, పుస్తకములుజాగ్రత్తచేయుట సవరించుట మొదలగుపనులన్నియు ఆవిడమీదే వదిలిపెట్టక నీవుకూడా సాయము చేయుము. అంతా ఆవిడకే వదలిన విసుకేకాక, ఎదో గొప్పపని తనుచేసినట్లనుకొని నిన్నీసడించును. కానీ, నీవుకూడా సాయపడితే శ్రమతోచదు సరికదా, పనికూడా ఉల్లాసముగ జరుగును. మధ్యమధ్య సరససల్లాపములకు కూడా సమయము దొరకును. సరసాలాడుతుంటే ఎంతసేపైనా క్షణముగను, ఎంతపనైనా చులకనగను తోచు టబ్బురముకాదు.

ఒక్కొక్కప్పుడు ఆవిడకు వొంట్లోసుస్తిగ వుండవచ్చును. వండి, వడ్డించుట కోపిక లేక పోవచ్చును. ఓపికలేక, పండ్లుబిగించుకొని, ముక్కుతూ, మూలుగుతూ ఆవిడ వంట చేయుచున్నప్పుడు నీవూరకచూచుచున్న లాభములేదు. అయ్యోపాపమని యనుతాపపడిన యంతకన్నలాభములేదు. నీవల్ల అయిన సాయము నీవుచేయవలెను. ఆవిడ వద్దువద్దన్నా, మానక నీవేదైనా చేసిన ఆమెకెంతయో ఆనందము కల్గును. నాకువంటరాదు. నేనేమి చేయగలనని నిస్పృహ పడనక్కరలేదు, కూరలు ఏరి తరిగి పెట్టవచ్చును. కాఫీకాచవచ్చును. ఆమెవద్దన్నా మీకెందుకు మగపుట్టుక పుట్టియని. పలుమారంటున్నా నీవది చెవినిపెట్టకూడదు. ఆవిడ పలుకులు వేదవాక్కులని నీపనిమానకూడదు. నీవుకాచియిచ్చు కాఫీ ఆమె కమృతము కన్నవేయిరెట్లు రుచిగవుండును.

నీభార్యస్వంత ఖర్చులకు నీవు కొంతపైకము మీయవలెను. ఆమెచేతిలో డబ్బుండుట నీకెంతో అనుకూలము. ఆమెకిచ్చిన పైకమునకు నీవులెక్కయడగ కూడదు. ఏవోచిల్లర వస్తువులు కొని ఆవిడకు మనసు కలుగును. నిన్నడుగుటకు సంకోచముగ వుండవచ్చును. సిగ్గుపడవచ్చును. గనుక ఆమెచేతిలో కొంత డబ్బు ఇవ్వవలెను. డబ్బంటే ఎంతో ఇవ్వక్కరలేదు. కొద్దిగాయిస్తేచాలు. ఇచ్చుట ముఖ్యము. వాటిలెక్క యడుగకుండుటంతకన్న ముఖ్యము.

వనితలు ముఖస్తుతికి ఉబ్బితబ్బిబ్బులగుదురు. వనితలేమిటి అందరూ అంతే. పొగడ్తకు వశము కాని వారు 'నభూతో నభవిష్యతి'. కనుక సమయము చిక్కినపుడెల్ల ఉత్సాహము గలిగించు మాటలు, పొగడిక, తగినట్లువాడిన మీసౌఖ్యమునకు కొరతలేదు. ఆమెసౌఖ్యమునకు కంతులేదు. కాని జాగ్రత! మరచియైనా అతిచేయకూడదు సుమండీ, అతియైన, హేళనేమో యని యామె యభిప్రాయపడ వచ్చును.

ఆవిడొక క్రొత్తచీరకొని, కట్టుకొన్నదను కోండి; ఆచీరను పొగడి, ఆవిడ కట్టుకొన్నందు వల్ల ఆచీర రాణించినదని-ఇటువంటి మంచిమాటలు వొకటిరెండు వెంటనే చెప్పి సంతోషించాలి. కాని ముఖము చిట్లించుకొని బోలెడు డబ్బుబోసి ఇప్పుడెందుకీచీర, ఈచీరలేకుంటే నీ అందాని కెక్కడ తక్కువ పడ్డది అని ఈసడించరాదు. చీరఎటూకొని కట్టుకొని అయినదిగదా! ఖర్చుతప్పని సరియైనదికదా! మంచిమాటలాడి మనస్తాపము తప్పించుకో వచ్చునుకదా!

ఆడవాళ్లను వశపరుచుకొనే మాటలు మీకు తెలియదా! నేవేరే చెప్పాలా?

ఆవిడ అలంకరించుకొను నపుడెల్ల, ఆపి,గమనించి ఒకమంచిమాట విసురుతూ యుండవలెను. ఆక్షేపణ ఎప్పుడునూ పనికిరాదు.

నీవెంతో బాగున్నావన్న మాటస్త్రీమీద విద్యుచ్ఛక్తిని ప్రవహింప చేయును. అందులో భర్తనోటి నుండి వచ్చిన నూతనుడుగు లెక్కువ.

ఆవిడకు ప్రియమైన వస్తువును నీవుకొని ఇచ్చిన ఆమె యానందమున కంతులేదు. పండుగ పబ్బము లలో, చిన్నదైనాసరే, ఆవిడకేదైన కానుకొసంగిన నీవు నిశ్చయముగ, ఆమె హృదయ సింహాసనమున చిరస్థాయిగా పద్మాసనస్థితుడవు కావచ్చును.

నీభార్యకేది ఇష్టమో నీవుకనుగొన వలెను. కనుగొనుటంత కష్టముకాదుకూడా. ఆవిడ నడుగుటకన్న నీవే వూహించుకున్న వాటివిలువ మరింత ఎక్కువ.

ఆమెకోరు వస్తువులు, సామాన్యముగ చౌకధరకు దొరుకు అల్ప వస్తువులుగ నుండును. ఇంత అల్పమైన దానిని యడిగినదే ఇదేమంత బాగున్నది! ఎవరిపిచ్చి వారికానందము;- పిచ్చిమనిషి, కోరకకోరక ఇదాకోరటం యని యనుకొనకూడదు. నీకంటికి, మనసునకు అనువైతోచినదామెకు మహామేరువుగ వుండ వచ్చును. వస్తువును వాంఛించుట వెలను బట్టికాదని పురుషులు ముఖ్యముగ గమనించవలెను.

పిల్లలున్న తండ్రులు, పిల్లలమధ్య ఆమానవతిని చులకనచేయకూడదు.ఆక్షేపించి అవమానింప కూడదు.

పిల్లలన్న మాటేమిటి ఇతరులయుందు స్త్రీని పురుషుడెప్పుడునిర్లక్ష్యపరుపకూడదు.ఆడమనిషిని పురుషుడు నిర్లక్ష్య పరచకూడదు. నీబిడ్డలను తల్లిదండించిన నీవు పిల్లలపక్షపాతివై తల్లినికోపించడమో దండించడమోపనికిరాదు. పిల్లలముందు చులకనగమాటాడిన,వారికి తల్లియందుగౌరవముండదు. తనుకన్నపిల్లలు తన్నుఅలక్ష్యముచేసిన తల్లిఎన్నిటికిని సహించదు.కనుక ఆమెపిల్లలదండించిననీవడ్డముపోవద్దు; తల్లి దండించినప్పుడు నీవుపిల్లలకనుకూల ముగమాట్లాడిన నీపిల్లలుపాడగుటకు, మీభార్యాభర్తలమధ్య చిన్న కలహములకు అవకాశమేర్పడును.ఆమె పిల్లలుఅల్లరి చేసిన ఆమెయే సవరించుకొనును. నీవాజోలికిపోవద్దు.

పిల్లలను చావమోదుచున్న వూరక చూచుచుండవలసినదేనా, ఏమిటీసలహా పిల్లలున్నవారనవలసి నమాటేనా, యనియనుకోవద్దు.అప్పుడు నీవూరకుండవలసినదే. ఆమెశాంతించి వొంటరిగవున్నప్పుడు, నీభార్యను నీవు తగినట్లుచీవాట్లుపెట్టుము. అప్పుడామె కాదనదు. ఆమెకోపించక,యుక్తా యుక్తములరసి తాచేసిన తప్పుగనుగొని, మరలఆతప్పు చేయకూడదనితీర్మానించుకొనును,

ఇరువురు వొకటై ఆలోచించిచేయుకార్యము లెప్పుడు మంచిఫలములే ఇచ్చును.

తనకుమారుడు బడిలో చక్కగ చదివి,అన్నిటిలో మంచి మార్కులు తెచ్చుకొన్నాడని పులకాంకితురాలై,నీతో వన్నెలు చిన్నెలు కలిపించి చెప్పునప్పుడు నీవుపూకొట్టివినక నేనెరగనా, నీతెలివి నీకొడుకు తెలివి, వాడిసంగతి గొప్పగాచెప్పొచ్చావని,అపిల్లవాడు ఆనాడుపొద్దున ఎక్కతప్పుచేసినదో, లేక కాఫీవొలకపోసినదో జ్ఞప్తి పరచకూడదు. అట్లుచేసినమీఅబ్బాయికి మీమీదకోపమువచ్చును.మీతో మాటాడడు మీమీద నేరాలు తల్లితోచెప్పచుండును. మీఆవిడకు ఆమెమాటలు మీరామోదించలేదని కోపమువచ్చును.

అయితే ఏమనాలంటారు,ఇలాఅనాలి వాడికేంవాడుబుద్ధిలో బృహస్పతి,చదువులసరస్వతి,నీకుమారుడు కాదా.వాడుతెలివితక్కువ వాడెలాఅవుతాడు వాడివల్లే మనముసుఖపడపోతాంఅనండి.

అప్పుడాతల్లి బిడ్డలహృదయానందము వర్ణింపగలమా?

ఇవన్నియువొకఎత్తు.ఇప్పుడు చెప్పబోవునది వొకఎత్తు

పరస్త్రీని గురించిమాట్లాడునపుడు నీవెంతయో జాగ్రత్తగ వుండవలెను.పొరబాటునసైనా మీఆవిడముందు వర్ణించకూడదు.

మీప్రక్కింటావిడ నాజూకుగా వస్త్రధారణ తలఅలంకరణము చేసుకొన్న,ఆవిషయము,నీభార్యతో నీవు చెప్పదలచుకొన్న అది ఎంతో నేర్పుగచెప్పవలెను.అంతేకాని అవక తవకగచెప్పి,అవును,నాకును వొక వంటలక్క వున్న-అధికారంచలాయిస్తూ, అంతకన్నఅందముగ అటుఇటు తిరుగుచు అందరిని ఆకర్షిస్తును.మీఇంట్లో నేనేవంటలక్కను.నేనే దాసీదాన్ని, నేనేచాకలిని,ప్రొద్దునలేచినది మొదలుదొడ్లో నేపడిచస్తుంటే శృంగారించుకొని మీఎదురుగా తైతక్కలాడసమయమేది, యనివొకజడివానమీద కురిపించును, అప్పుడునీవాపోరుపడలేక నీభార్యనసూయాగ్రస్తురాలనియు, అల్పురాలనియు,నిందింతువు.ఇదికలహ బీజము. ఇకఆరోజుమాటలు పెరిగి పెరిగి చెయిచేసుకోవడం వరకురావచ్చు. సరే ఇకఆరోజు ఇద్దరు పస్తేయని వేరేచెప్పనక్కరలేదు.మూడు రోజులవరకు నిద్రా హారాలు మాటమంతే వుండదు.

నీకుఆవిడమీద అనురాగమున్నదని నోటితో చెప్పిన చాలదు. దృష్టాంతములు కూడా అప్పుడప్పుడు చూపుచుండవలెను.చిన్నవిషయమైనానోటినిండాపొగడినకాని ఆడదానికి తృప్తియుండదు.

నీవు నీస్నేహితులను విందుకుపిలువతలచిన ముందునీభార్యను వుపచరించి, ఆవిడ సలహాగొని స్నేహితుల ఆహ్వానించిన నీకుమరియాద దక్కును.విందుకాగానే నీభార్యతో నీకుశ్రమేకాని తిన్నవారికందరికి పరమసంతోషం. వంటచాలా బాగున్నది. నాస్నేహితులంతా మెచ్చుకున్నారు. నీవల్ల నాకెంత గౌరవం ఎంతమంచిపేరు నీవునాభార్యవగుట నాఅదృష్టం యన్నఆమెపడ్డశ్రమంతా మరచి కొండెక్కిపోవును కదా !

ఆమెశ్రమపడుటెందుకు?జీతానికా?కాదు. నీవు,ఆవిడెయొకటి.నీకై ఏమైనాచేయునన్న నమ్మకము నీకెప్పుడుకల్గును? చేయించుకొను నేర్పునీదగ్గ రున్నప్పుడే. నీవప్పు డప్పుడామెను పొగడుచుండిననే నీవను కొన్న పనులు నిర్విఘ్నముగ జరుగును.నీప్రియమైనమాటలే ఆమెశ్రమకు విశ్రాంతి,జీతము కూడా.

ఏమిటో పరోపదేశపాండిత్య మంటారేమో సోదరులు. సోదరీమణులకు కూడా కొన్నిహితవాక్యములను వచ్చే సంచికలో వ్రాస్తాను.

# స్వాగతము

శ్రీమతి చిల్కపాటి సీతాంబగారు:

ప్రవిమలధర్మమూర్తి యయిభాసిలు కేసరికన్నతండ్రి; యా
కవికలహంసి నీదయినగాటపు నెచ్చెలి; సద్యశోనిధుల్
దవిలినుతింప పెంపుగను ధన్యవు నీవు; శుభోదయమ్ములన్
భువిగను; రమ్ము గొమ్ము వివిమెపూత శుభాన్వితస్వాగతమ్ములన్.
అలఘుమనీషలౌ కవిజనాళిరచించిన పద్యరత్న భూ
షల నలరించిమించి సువిశాలయశోవిభవాభిరామువై,
చెలువలు రమ్యగీతికలచే గయిసేయ నశేష శేముషీ
నిలసిత మూర్తివై, బుధులు వేమరు మెచ్చినుతింప నింపులౌ
జిలిబిలిముద్దుపల్కులను చెన్నలరన్వలె; తెల్గుకైతలన్
కలకలలాడగావలె; నిగారపు నేరుపు మీరక్రొంగథల్
దెలుపవలెన్; మనంబలర తేటగుమాటల లోకవృత్తముల్
బలుకవలెన్; సతీమణులపాలిజయేందిర వేబుధారుణిన్
వెలయవలెన్; నినున్‌గనినవిశ్రుతకీర్తియు భవ్యమూర్తియ
త్యలఘు గుణాన్వితుండయిన యార్యనృకేసరి కీర్తిచంద్రికల్
జిలుకుచు తెల్గుబాస గయిసేయవలెన్; గృహలక్ష్ములెల్లని
చ్చలుగని గారవింపగ భృశమ్ము గరమ్మిదె స్వాగతమ్ముమ
న్నలరగగొమ్ము పద్యముల మంజులగేయములన్ సువర్ణ సం
కలిత వికాస నాటికల గద్యల హృద్యము గాగ గూర్చి వాం
ఛలరనలంకరింతుము మహామతు లౌదలలూపి మెచ్చగన్.

# భూ లో క కై లా స ము

[శ్రీస్వామి రాజేశ్వరానందజీగారి రచనకు శ్రీస్వామి కేశవతీర్థగారి అనువాదం.]

అవతారము, లేక ముక్తపురుషుడు వసించేస్థానము—సర్వమానవులకు జాతికుల వర్ణ స్త్రీపురుషభేదాలు లేకుండా బ్రహ్మానందశాంతిప్రేమలు రాజ్యమేలుతున్న భూలోక కైలాసమే. అట్టి ఆనందధామం, దక్షిణాపథంలో తిరువణ్ణామలై 'యరుణాచల' పర్వత పాదంలో, సర్వప్రాపంచిక వ్యాకులాలు, సంకులశబ్దచ్ఛాయలు కొంచెంకూడాలేని సుందర మనోహర ప్రకృతిదృశ్యాలమధ్య సర్వజనవిదితంగా విరాజిల్లుతున్నది. ఆది పవిత్ర హిమాలయ ఏకాంత ప్రదేశాలను పోలియున్నది. ఇక్కడే భగవాన్ శ్రీరమణమహర్షుల వారు, చిదాకాశంలో నిర్మలగాంభీర్య పవిత్రతాకిరణాలు ప్రసరింపజేస్తూ, జ్ఞానభాస్కరుని వలె ప్రజ్వలిస్తున్నారు. ఈయుగంలో మనమధ్య జగజ్జీవన సముద్రనావికులకు మార్గదర్శక జ్యోతియై, ఆధ్యాత్మిక జగత్ప్రేరణాకేంద్రమైయున్న యిలాంటి మహర్షిని మనమధ్య కలిసియుండడం అసాధారణ పుణ్యఫలం !

వారు సర్వవిశ్వప్రేమాలింగన విశాలబాహువులు చాచియున్నారు. వారి మాన్యతకు పరిచయాలు, సిఫారుసులు, యోగ్యతాపత్రాలు అనవసరం. పశుపక్షి మానవ సంబంధమైన అగాధముఖ్య సమస్యలన్నిటికి వారు సమాధానమైయున్నారు. వారిక్రీగంటి యనుగ్రహావీక్షణం ప్రతివ్యక్తికీదివ్యానందాన్ని ప్రసాదిస్తుంది. హృదయాంతర్గతమైన ఆంతర్గాఢాంధకారాన్ని పటాపంచలుచేస్తుంది. వారి ప్రబోధాలు నవనవ స్వచ్ఛములైనవి. శక్తివంతములైనవి. అవి హృదయద్వారాలుతెఱచి నిగూఢప్రజ్ఞాప్రభావాన్ని బహిర్గతం చేస్తున్నవి. వారిమతం అంధ విశ్వాస సిద్ధాంతాలకు దూరమైనది. అదిజడసాంప్రదాయ బద్ధంకాదు. అది నక్షత్రంవలె తేజోవంతమైనది. అకాశమంత విశాలమైనది, సముద్రమంత అగాధమైనది. చంద్రబింబంలాగా శీతలమైనది. పుష్పంవలె సౌరభవంతమైనది. సూర్య కిరణాలమాదిరి విశ్వైక్యమైనది.

వారు, ప్రపంచరంగంమీాద జీవననాటకంలో మానవుణ్ణి జడమయంగా వాని పాత్రను అభినయింపచేయనీయక, వానివాని శక్తిసామర్థ్యాలకొలదీ చేతనావంతంగా



భూలోక కైలాసయోగి శ్రీరమణమహర్షి

వర్తింపచేస్తారు. ఈ ప్రాపంచకనాటకంలో బాహ్యదృశ్యానికి రాజుగా సేవకునుగా పాత్రా నటనచేసినన్నూ, మానవుకు తానవేవీకానను ప్రజ్ఞనుస్ఫురింపచేస్తారు. ఈపరిచ్ఛిన్న జగత్ప్రివాహానికి అధిష్ఠానిభూతమైన అంతర్దివ్యత్వాన్ని, చైతన్యాన్ని, ప్రధానసూత్రాన్ని వారు ప్రతివానిహృదయంలో వెలిగిస్తారు. క్లుప్తంగా: వారు నిద్రానుమానవ జీవితాన్ని ప్రబుద్ధంచేస్తారు. అంధకారాంతఃకరణగుహాలో పరంజ్యోతిని వెలిగిస్తారు. హృదయవనంలో దివ్యసౌరభం విరజిమ్ముతారు. ఈవిధంగా ప్రతివ్యక్తియందూ, సంపూర్ణాత్మ జ్ఞానప్రభావ సౌందర్యాన్ని వ్యక్తీకరిస్తారు.

---

# 1941 జనాభా లెఖలలో

## స్త్రీల స్థితిగతులు

1941 లో భారతదేశంలో మొత్తం జనాభా =388997000.

వీరిలో స్త్రీలు =188000000.

అనగా 100 గురు పురుషులకు 93.5 మంది స్త్రీలేవున్నారు.

స్త్రీజనం 1931 కంటే తగ్గిపోయినారు; అప్పుడు 100 కి 94 మందే ఉండేవారు.

ముఖ్యంగా పశ్చిమోత్తరపరిగణాలలో పంజాబులో ఇతర రాష్ట్రాలకన్నా స్త్రీలు పురుషుల కన్నా తక్కువసంఖ్య.

పశ్చిమోత్తరపరగణాలలో 100 పురుషులకు 84 గురు స్త్రీలుంటే, పంజాబులో 84.7 ఉన్నారు. అసలు పుటకలలోనే ఈ తేడా వచ్చినది. 100 ఆడపిల్లలు పుట్టేసరికి 118 మగబిడ్డలు పుట్టుతున్నారట.

### విద్యావిషయములు

ప్రాథమిక విద్యాభ్యాస మొనర్పగల మగపిల్లలలో 100 కి 40 వరకు బడికి పోతున్నారు. అదే వయసు ఆడబిడ్డలు 10 మంది మాత్రమే బడికిపోతారు. మొత్తంమీద 370 లక్షలమంది మగవారు చదువను వ్రాయను నేరిస్తే 93 లక్షలే స్త్రీలు వానిని నేర్చినారు.

---



# బాలానందం

శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు.

ఎన్నాళ్లకొచ్చావు ! "గృహాలక్ష్మి" !
సంక్రాంతిపండుగకు "గృహాలక్ష్మి" !
పుట్టింటికొచ్చావ ? "గృహాలక్ష్మి" !
పాతనూతనచెలులు "గృహాలక్ష్మి" !
బాలబాలికలెల్ల "గృహాలక్ష్మి" !
రాకవినగానె "గృహాలక్ష్మి" !
ఆనందహృదయులై "గృహాలక్ష్మి" !
నీబంతిచేమంతులతో "గృహాలక్ష్మి" !
నిన్నలంకరించిరియొ "గృహాలక్ష్మి" !
గొబ్బితట్టుచుపాడి "గృహాలక్ష్మి" !
పసుపుకుంకుమలతో "గృహాలక్ష్మి" !
ముంగిళ్లముగ్గులతో "గృహాలక్ష్మి" !
గోడవెల్లలతోను "గృహాలక్ష్మి" !
పిండివంటలతోను "గృహాలక్ష్మి" !
బొమ్మలకొలువుతో "గృహాలక్ష్మి" !
ఇంటింటనిన్ బిలిచి "గృహాలక్ష్మి" !
సంక్రాంతీకానుకలు "గృహాలక్ష్మి" !
శిల్పచాతుర్యములు "గృహాలక్ష్మి" !
లలితచిత్రకళలు "గృహాలక్ష్మి" !
నృత్యగానకళలు "గృహాలక్ష్మి" !
గద్యపద్యకధల; "గృహాలక్ష్మి" !
ఘనస్వాగతంబొసగి "గృహాలక్ష్మి" !
చిరకాలపరిచయము "గృహాలక్ష్మి" !
తిరిగికల్గెనంచు "గృహాలక్ష్మి" !
ఆనందమొందితిమి "గృహాలక్ష్మి" !

# శ్రీమతి విజయలక్ష్మీ పండిట్.

—(o)—

అది 1900 సంత్సరము. 19 వ శతాబ్దము అంచుకువచ్చి కాలపురుషుడు, 20 వ శతాబ్దములోనికి తొంగిచూస్తున్నాడు. త్రివేణీ సంగమ ప్రాంతములో నాడువర్షపు చుక్కరాలలేదు. హిందూస్థానమును వైస్‌రాయిగా నేలు కర్జన్ ప్రభువు "ఏమిటిది" అనిచూడవచ్చినాడు. ఆచల్లటి ప్రభుని రాకవల్ల నైనా బిందించలేదు. ఎక్కడనైనా రహస్యంగా 'మీరాకవల్లనే మాకిన్ని కడగండ్లు' అనినాల్గుకన్నీటిబిందువులను ఎవరైనా రాల్చినారేమో. అయితే ఇట్లుండగా ఒకనాడు (18-8-1900) ప్రయాగక్షేత్రంలో ఆనంద భవనమున మోతీలాలు నెహ్రూయింట స్త్రీశిశువు జననమైనది. అంతలో మబ్బులుగమ్మి వర్షించినది. నేలచల్లబడ్డది. రైతుల మనస్సు చల్లబడ్డది. భూదేవి పదిరోజుల పురుడు గడిచేటప్పటికి, చిలకపట్టుచీర గట్టి బారసాల పేరంటానికి సిద్ధమైనది. ఆచిన్నిశిశువు జననముతో, ప్రజల కుత్తుకల నొక్కివేయనున్న అనావృష్టి, కఱవు, కాటకం మటు మాయమైపోయినవి.

నెహ్రూ ఇంటికి ఆశిశువు జననం అమృతజ్యోతి యైనది. మోతీలాల్ నెహ్రూ అప్పటికి రెండుచేతులా పుష్కలంగా ధనం సంపాదిస్తున్నాడు. విచ్చల విడిగా ఖర్చు చేయగా నిలిచిందిపెట్టే అసదృశమైన ఆనందభవనమును కట్టించాడు. శాశ్వతంగా తన సంతతు లందు కాపురము చేస్తారనుకొన్నాడు కాబోలు. ప్రతిహంశము తాను స్వయముగా చూచుకుంటూ ఆభవనాన్ని కళాకాంతు లుట్టిపడ కట్టించు కొన్నాడు. మోతీలాల్ నెహ్రూ అంతభవనంలోను ఆడుకొనుటకు జవహరిలాలుకు (అప్పటి కతనికి 11 సంవత్సరములు) తోడు బాలుడుగాని, బాలికగానిలేరు. ఆయింట్లో చేరిన బంధుజనాని కంతా ఎత్తిముద్దులాడను పాలబుగ్గల పసిపాప కరువైనది. ఆలాటి సమయంలో అందాల రాసియై ఆశిశువు జన్మించి ఆ ఆనంద భవనాన్నంతా తన లేతనవ్వులతో తేజోమయ మొనర్చి ఆనందసాగరము గావించినది. ఆమె స్వరూపకుమారి నెహ్రూ. నేడామెయే శ్రీమతి విజయలక్ష్మి పండిట్ అనిప్రసిద్ధి పడసియున్నది.

నెహ్రూకుటుంబము సర్వసామాన్య మైనది కాదు; చరిత్రాత్మక మైనది. వారు కాశ్మీర పండితులు. ప్రాచీనకాలములో ఆర్యులు తమ తొల్లిటి నివాసమునుండి బయలుదేరి

పారసీకంలోకి కొందరు వెళ్లారు. గ్రీసుకు కొందరు నడిచారు. భారతదేశానికి మరికొందరు వచ్చారు. ఆ గ్రీకులలో కొందరిని పారశీకపురాజొకడు బందీలుగాజేసి కాశ్మీర ప్రాంతములలో వదిలేశాడు. వారక్కడ నివాస మేర్పరుచుకొని హిందువులై, బ్రాహ్మణులై, పండితులైనారు: అని కీ॥ శే॥ శ్రీవేదము వెంకటాచలయ్యగారు వ్రాసియున్నారు.ఆకాశ్మీర పండితులు కొన్నాళ్లాదేశము నేలారని శ్రీకొమర్రాజు లక్ష్మణ రావుగారు వ్రాసినారు. మన నెహ్రూలు అట్టి ఉజ్వలజాతి సంజాతులు. నెహ్రూకుటుంబము మొగలాయీ సామ్రాజ్యం తుదిరోజులలో ఢిల్లీలో గొప్పగొప్ప పదవుల ననుభవించినది. సామ్రాట్టుచే, జాగీరులను, బహుమానములను పొందినది. విజయలక్ష్మితాత గంగాధరనెహ్రూ 1857 విప్లవమునకు ముందు ఢిల్లీకొత్వాల్‌గా నుండిరి. నెహ్రూలు నంఘమున ఉత్తమ శ్రేణికి చెందినవారైయుండుటచే ఉదార స్వభావులు, రాజసగుణప్రధానులు, గంభీరమూర్తులు, విశాలహృదయులు, ధీరులు, దేశభక్తులు, భోగులు, త్యాగులు. ఈమేలిగుణములు స్త్రీ పురుషులకు సర్వసామాన్యమైనవి. విజయలక్ష్మి పితామహి మూర్తీభవించిన దర్పమట. ఏదైనను శాసించి రూపించుటే గాని వేరెరుగుదట. ఆమె పేరీనాటికి కాశ్మీరపండితుల యిండ్ల నానుడిగా చెప్పుకొనెదరట. ఆమె ఆజ్ఞ "తు" "చ" తప్పకుండా జరుపవలసినదే; గత్యంతరము లేదు. పొల్లు పొరపాటులాయనా, ఆమెరోష కషాయిత దృక్కుల యెదుట నిలువగల వ్యక్తులు ఆరోజులలో లేరట. అట్టి ఉజ్వల స్వభావముగల ఆమె పుత్రుడు మోతీలాలు నట్టివాడాయెను. ఆమేలిగుణమే జవహరిలాలున కప్పుడప్పు డావేశించుచుండును. అయ్యదియే వారి చిన్నచెల్లెలు శ్రీమతి కృష్ణాహాతిసింగ్‌ను వెల్లడించునట. అదియే నెహ్రూకుటుంబము యావత్తునకు తెల్లవాని పెత్తన మీదేశమున అసహ్యించుకొని ధిక్కరించుటకు ఉపకరించినది.

1857 నాటికి మొగలాయి దర్బారు కొలువున నుండిన నెహ్రూ కుటుంబమునకు తదనంతరము కొన్నిరోజులు కృష్ణపక్షము. నెహ్రూ కుటుంబము ఆవిప్లవ మణచబడిన అనంతరము ఢిల్లీవిడిచి పారిపోజొచ్చినది. దారిలో ఒక వింత విశేషముజరిగినది. విజయలక్ష్మి పెద్దతండ్రులలో నొకనిభార్య చాల అందమైనదిగా నుండెను. దారిలో నెదురైన ఆంగ్లసోల్జరులు ఆమెను ఆంగ్లబాలికనుగా దలంచి నెహ్రూ పెదతండ్రు లాబాలికనపహరించుకొని పోవుచున్నారని దూషించి దోషులనుగా

వారిని సైనిక విచారణగావింప బోయిరి. అరోజులలో సైనిక విచారణ ఐ. యన్. ఏ (బోసు జాతీయ సైన్యము) విచారణగాదు. విచారణ, శిక్షవిధించడం, దానినములు జరుపుట ఆంతాక్షణికమే. ఆనాడు దోషియని అనుమానింపబడిన వాడొక్క తృటిలో దారిప్రక్కన చెట్టునకు వ్రేలాడి చావవలసినదే. కాని ఆ పెత్తండ్రులకు ఆంగ్లభాష కొంత కొంత తెలిసిన కారణమున అవాంతరము తప్పినదట. మోతీలాలు, నెహ్రూతల్లి ఉజ్వల స్వభావముగలది యైనను, భార్య, (విజయలక్ష్మీ తల్లి) నవనీతహృదయము, మధురవాక్కుగల అమృత స్వభావముగలదియట. ఆరెంటి చేరికయే శ్రీమతి విజయలక్ష్మీ పండిట్ యందు ప్రస్ఫుటమైనది. అదియే అమె నయస్వభావమునకును, వెనుదీయక పోరాడగలశక్తికిని, మూలము. ఆదియే స్వదేశీయుడగు (సర్) ఫిరోజ్ ఖాన్ నూన్, విదేశీయుడగు జనరల్ స్మట్సు, ఆనే ఇద్దరు వ్యక్తులను-అంతర్జాతీయ సమావేశముల విదళించి వైచి భారతీయుల హక్కులను నిరూపించు ఓర్పు, నేర్పుల నామెకు ప్రసాదించినది.

శ్రీమతి విజయలక్ష్మీ బాల్యమంతయు సాయిలా పాయిలాగా వెళ్లిపోయినది. కాని సుశిక్షణపొంది, పిదప జాతీయరంగమున ప్రధానపాత్రత వహించి నిర్వహించు నైపుణ్యమును ఆమె సంపాదింపగలిగినది. నెహ్రూపూర్వులు మొగాలాయి, పారసీక సాంప్రదాయముల నలవరచుకోగా శ్రీ మోతీలాల్ ఆంగ్లసాంప్రదాయముల స్వీకరించెను. విజయలక్ష్మికి తగుశిక్ష లొసంగి విద్యావంతురాలిని గావింప హూపర్ కన్యయను నొక ఆంగ్ల యువతిని ఆంగ్లదేశమునుండి రప్పించి, ఆమె కాబాలిక నప్పగించెను. ఆ ఆంగ్లయువతి విజయలక్ష్మికి విద్యాబుద్ధులయందు తగు శిక్షణనొసంగినది. గుర్రపుస్వారి మున్నగునవి కూడ నేర్పినదట. ఆమె యెట్టి ఉత్తమశిక్షణ యిచ్చినదియనుటకు, పాఠశాలకెప్పుడును వెళ్లని విజయలక్ష్మీనేడు నిర్వహించుచున్న ఉత్తమ పదవులే సాక్ష్యములు.

విజయలక్ష్మీ చిన్నతనముననే తండ్రితోపాటు 1915 సంవత్సరము బొంబాయి కాంగ్రెసుకు వెళ్లిచూచినది. నాడే ఆమెహృదయమున దేశసేవాసక్తిజనించినది. గతయుద్ధారంభమునాటికే ఆమెకుహ తెలిసినది. యుద్ధముతోపాటు ప్రపంచమున మొలకెత్తితీగలు సాగిన వివిధాదర్శములు, వివిధోద్యమములు ఆమె లేతమనసున బాగుగాహత్తుకొన్నవి. అంతవరకు భోగపరాయణులైయుండిన తండ్రిఅన్న త్యాగపథమునకు మరలునప్పటికామెకు యౌవనాంకురమైనది. పంజాబు హత్యలు మొదలుగాగల వానివలన తండ్రికి అన్నకు కల్గిన

మనోవేదన స్వాతంత్ర్య సమరాసక్తి స్వయముగా తెలిసి తాను అనుభవించినది. ఇంతేల ఆమె 20 వ శతాబ్దముతోపాటు పుట్టిపెరిగినది. కావుననే చరిత్రనిర్మాణమునకు వివిధ పాత్రలలో నామెయొక్కతె యైనది.

అన్నతో తండ్రితో అమె పలుమారులు ఖైదుననుభవించినది. అన్నతో తండ్రితో అనేకసార్లు విదేశముల చుట్టివచ్చినది. ఆయాదేశముల మంచిచెడ్డలను గ్రహించినది. ఆమెయే భారతదేశమందు ప్రప్రథమమున రాష్ట్రమంత్రియై పురుషులకన్న మిన్నగా పరిపాలన సాగించిన స్త్రీరత్నము.

శ్రీవిజయలక్ష్మికనుకూలమైనభర్త కుదిరినాడు. గుజరాతునుండి యొక ధనాఢ్యుడు, బారిస్టరునగు కాశ్మీరపండితుడు 1921 లో నదీనదములు గడిచి, వంతెనలు వారధులు దాటి వచ్చి విజయలక్ష్మి పాణిగ్రహణము నర్థించెను. ఆయన నయవినయములు, పాండిత్యప్రభావములు విజయలక్ష్మి నాకర్షించినవి. అసలీకథకంతయు సూత్రధారి మహాదేవదేశాయియట. అగుచో గాంధి ఎరుకలేకుండా యీప్రయత్నము జరిగి యుండునా? వారి అనుకూల దాంపత్య మాదర్శ ప్రాయముగా 1944 వరకు గడిచినది. 1944 లో ఆమె జైలునుండి విడుదలకాగానే యిరువురు కుమార్తెలను అమెరికాకు విద్యార్జనకై పంపినది. పిదప ఆమెభర్త వ్యాధిగ్రస్తుడై ఆమెను దుఃఖసాగరమున విడిచి దివికేగినాడు. పండితుడు, కవి, దేశభక్తుడు, భోగి, త్యాగి అన్నిట విజయలక్ష్మి కనుకూలమగుభర్తయై యుండి ఎల్లర మెప్పువడసినాడతడు. 1945 సంవత్సరమున ఇట్టి తీవ్రతర దుఃఖరాసిలో మునింగియు ఆమె దేశసేవయందుతన కర్తవ్యమును నిరూపించుకొనుటలోను నిర్వహించుటలోను వెనుదీయలేదు. అమెరికాకువెళ్లి ప్రపంచమంతయు దద్దరిల్లునట్లు భారతస్వాతంత్ర్య ప్రబోధముగావించి మెరసినది.

1942 ఉద్యమమున నిర్బంధితులైన కాంగ్రెసు నాయకులు 1944–45 వరకున్నూ యింకను జైళ్లలో మ్రగ్గుచుండిరి. బ్రిటిష్ప్రభుత్వమువారు సర్. రామస్వామిమొదలి, ఫిరోజ్ ఖాన్ నూన్ గార్లను,తమకనుకూలురను అమెరికాలో,(ఫ్రాన్సిస్కో) జరిగిన యునైటెడ్ నేషన్స్ సమావేశమునకు భారతీయ ప్రతినిధులనుగాబంపిరి. ఆసమయమునకుఅక్కడ చేరియుండిన శ్రీమతి విజయలక్ష్మిపండిట్-భారతీయుల నిజమైన జాతీయాభిప్రాయములను వెల్లడించుచు, బ్రహ్మాండమగు ప్రచారము గావించినది. ఆమహాసభకొక

గొప్ప మెమోరాండము తయారుచేసి దాఖలుచేసినది. దానితో, ప్రపంచమంతటికి భారతీయులకు నిజమైన ప్రాతినిధ్యము వహించునది శ్రీమతి విజయలక్ష్మిగాని-ఆపురుషు లిర్వురున్నూ కారు, అని వెల్లడియైనది. ఆవిధముగా విజయముగాంచి భారతదేశమునకు తిరిగి వచ్చినది. ఇక్కడ ఎన్నికలు జరుగుచుండెను. ఎన్నికలుకాగానే ఆమెతిరిగీ యు. పి. రాష్ట్రమున మంత్రిణిగా నియమింపబడినది.

1946 ఏప్రిల్‌లో వివిధరాష్ట్రముల మంత్రివర్గము లేర్పడినవి. అప్పుడు వచ్చిన కాబినెట్‌మిషన్ వారి సంప్రతింపుల ఫలితముగా సెప్టంబరు 2 తేదిన కేంద్రప్రభుత్వమేర్పడినది. ఆప్రభుత్వమున శ్రీజవహరిలాల్ పండితుడు ప్రధానమంత్రియు, విదేశాంగ మంత్రియునాయెను. ఆయన ప్యారిస్‌లో జరిగిన యునైటెడ్ నేషన్స్ కాన్ఫరెన్సునకు భారత ప్రతినిధివర్గము నంపెను. ఆప్రతినిధివర్గమున కామెకు నాయకత్వమొసంగబడెను. జస్టిస్ చాగ్లావంటి ప్రముఖులును ఆప్రతినిధివర్గమున గలరు. అప్పటికి దక్షిణ ఆఫ్రికా యందలి భారతీయుల స్థితిగతులు విషమించియుండెను. భారతీయులకు పౌరసత్వపు హక్కులు నిరాకరించుచు కొన్నిచట్టములు చేయబడగా వాటిని తిరస్కరించుచు ఆచటి భారతీయులు సత్యాగ్రహము నడుపుచుండిరి. వేలకొలది స్త్రీపురుషులు అప్పటికే కైదుననుభవించుచుండిరి. అట్టిసమయమున 'యునెస్కో-సభ'కు మూలమైన అట్లాంటిక్‌చార్టర్ ప్రతిపాదించిన ధర్మసూత్రములకు దక్షిణాఫ్రికా ప్రభుత్వచర్య విరుద్ధమని ఆసభలో చెప్పియొప్పింపవలసియుండెను. దక్షిణ ఆఫ్రికాప్రధానిస్మట్సు, భారతీయ ప్రతినిధివర్గప్రయత్నమును భంగపరుపవలెనని పలుదేశములకూడగట్టుకొనెను. ఆసంవిధానములో శ్రీమతి విజయలక్ష్మి స్వతంత్ర భారతదేశపు ప్రథమ ప్రతినిధిగా అంతర్జాతీయ సమావేశమున నిలిచి, దిగ్దంతులవంటి రాజకీయవేత్తలకు ఎదురై వాదించవలసి యుండెను. అయినను ఆమెగాంధీమహాత్ముని ఆశీర్వాదముతో బయలుదేరి అచటికి వెళ్లి ధైర్యస్థైర్యములతో అతిచాకచక్యముతో, స్మట్సు వేయు పేచీలకు యుక్తిప్రయుక్తులతో ప్రత్యుత్తరమిచ్చుచు అసదృశముగ వాదప్రౌఢి చూపి స్మట్సు నోడించి తనపంతము నెగ్గించుకొన్నది; తనపంతమేగాదు. భారతీయుల ఆత్మగౌరవమును నిలువబెట్టినది. మోతీలాలునెహ్రూ కుమార్తె, జవహరిలాలు చెల్లెలు, గాంధీప్రియశిష్య

మతిమంతురాలు, ధృతిమంతురాలు అనేక స్త్రీ జ్యోతులు ప్రపంచమంతట దశదిశల నేడు అఖండములై వెలుగుచున్నవి. ఆధునిక కాలమున శ్రీమతి సరోజనీదేవి, అరుణ అసఫలి, కల్నల్ లక్ష్మి మున్నగు నారీమణులు విశేషఖ్యాతి సంపాదించిరి. కాని శ్రీమతి విజయలక్ష్మి పండిట్ వారందరికన్న అధిక ఖ్యాతి సంపాదించెనన్న అతిశయోక్తి లేదు. నిజముగా ఇట్టికుమారిని కన్న నెహ్రూకుటుంబమేగాదు, భారతమాతయే ధన్య.

ఇంకను 47 సంవత్సరముల ప్రాయము గడవలేదు. ప్రజాహిత జీవనమునకు కావలసిన సర్వానుభవముల చూరగొని ప్రాభవమున మెరయుచున్న ప్రోడ. అందుకనువుగా ఇంకనెంతో కాలము దేశసేవ చేయగల దేహదారుఢ్యము, మనోదారుఢ్యము కలదు. అందుకామెకనంతావకాశములును గలవు. ఇతోధిక ప్రఖ్యాతిగనగలదని సులభముగానే జోస్యము చెప్పవచ్చును. ఈశ్వరుడామెకు చిరకాలమాయురారోగ్యములనిచ్చి బ్రోచుగాక యని గోరుచున్నాము.

(మేమీ చరిత్రనచ్చు కూర్పించునప్పటికి శ్రీ విజయలక్ష్మి త్వరలో మాస్కో ప్రభుత్వముకడ భారత ప్రభుత్వరాయబారిగా నియమింపబడనున్నదన్న శుభవార్తను 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' పత్రిక ప్రకటించినది. గృ॥ సం.)

---



శ్రీమతి అమ్ముస్వామినాధన్, ఎం. ఎల్. ఏ. (సెంట్రల్)
వీరిని మలయాకు తమ రాయబారిగా వెళ్లవలయునని కేంద్రప్రభుత్వముకోరినది.




## హరిజన దేవాలయ ప్రవేశము.

చిరకాలముగా గాంధీమహాత్ముడు హరిజనులను ఉద్ధరించవలయునని బోధించుచున్నాడు. 1932 లో వారు హరిజనులకొరకే ప్రాణములను తెగించి ఉపవాసమును చేసియున్నారు. అప్పుడు బ్రిటిష్ ప్రభుత్వము వారు రాజ్యాంగచట్టములో వారికిచేసిన అన్యాయమును తొలగించినారు. అంతేకాదు. శ్రీ మాళవ్యా పండితుడు, శ్రీ రాజగోపాలాచారిమున్నగు హిందువులును హరిజనులను బాగుచేయుటకు హిందువులలో ప్రచారమొనర్చి పనిచేస్తాము అని పూనా ఒడంబడికయందు చేవ్రాళ్లుచేసియున్నారు. వారు వ్యక్తిగతముగా ఏనాడో అంటరానితనమును పాటించుట మానివేసినవారే. అయితే పూనాలో వారు హిందువులందరి ప్రతినిధులుగా ఆపని చేసియుండిరి. అందరు అనగా అందులో సగముమంది స్త్రీలుగదా. కావున స్త్రీలు అందరు వారివాగ్దానమును చెల్లించవలసియున్నది. తర తరాలుగా మనము వారిని హీనులవలెచూచిన పాప ఫలమును దక్షిణాఫ్రికావంటి విదేశములలో అనుభవిస్తూనే ఉన్నాము. అచ్చట స్త్రీలును ఇటీవల సత్యాగ్రహమొనర్చిరి. స్త్రీలనియైనచూడక అచ్చటి యూరపియనులు వారిని ఎంతో బాధలపెట్టిరని పత్రికల మనము చదివితిమి. అసలు సంఘసంస్కరణ మనేది స్త్రీలపైననే ఆధారపడియున్నది. స్త్రీలు సమ్మతించిన నాడు ఏసంస్కరణమున్నూ జరుగక నిలవదు. అప్పుడేధర్మశాస్త్రిలున్నూ అడ్డురావు. స్త్రీలపట్టుదలవల్లనే తగినవరుడు దొరకక, కట్నాలుకుదరక—శారదాచట్టము దానియంతట దేఅములు జరిగిపోవుచున్నదిగదా. నేడీ హరిజనదేవాలయ ప్రవేశమున్నూ, స్త్రీలు అంగీకరించి అములు జరిపింపదగును. పూర్వాచారములకు, మూఢాచారములకు స్త్రీలే పట్టుకొమ్మలని కొందరి అభిప్రాయము. ఆమాటకేవలము అంత సత్యదూరముకాదేమో! కావున ఈ క్రొత్తసంస్కరణ ఈకాలమున కవసరమైనదేగాక పూర్వాచారములకును సాంప్రదాయములకును కూడా విరుద్ధమైనదికాదు అని స్త్రీలు తెలియవలసియున్నది. శ్రీ కాళిదాసుకవి శ్యామలా దండకమున "మాతంగ కన్యాంమనసా స్మరామి" అన్నారు. ఛండాలునితో శంకరాచార్యుల వారొనర్చిన అద్వైత చర్చయు అందరికిని తెలిసినవిషయమే. పెండ్లిండ్లలోనూతనదంపతులకు ఆదర్శమునకై పతివ్రతయగు అరుంధతి నక్షత్రమును చూపుదురు. ఆమె వశిష్టమహర్షి భార్య. మతంగకన్యయందురు. జమదగ్ని భార్య పరశురాముని గన్నతల్లి—రేణుకాదేవి. కొలుపులలో ఆమె వేసమును ఒక్క పంచమస్త్రీ వేయును. సంకోచములేకుండా అగ్రజాతులును ఆమెనుచూచి సంతోషింతురు. కొన్ని ఇండ్లలో శుభకార్యములకుముందు ఏహరిజనదంపతులనో ఆదరించి ఆరాధించు ఆచారములున్నవి. ఏనవనాగరీకులైనా వానిని కాదంటే, స్త్రీలే ఆట్లునిరాకరించుట, ఇంటికి శుభముగాదని ఝడిసి పట్టుపట్టి జరిపింతురు. చిదంబరమున నందనారు తనభక్తివిశేషముల

వల్ల దేవాలయ ప్రవేశమును సాధించెను. ఒంటిమిట్ట కోదండరామస్వామి (కడప) వారి ఆలయమున ఒక మాల దాసరి తనభక్తిభావముచేత—శ్రీరామసందర్శనము సేవాభాగ్యములలభ్యపరచుకొనుటేగాక—ప్రతిసం॥ మును ఉత్సవములలో ఒక్కరోజున హరిజనులు సవర్ణులలో కలిసి మెలిసి తిరిగి ఆనందించు ఆచారమును ఏర్పాటు చేయించినాడు. మేలుకోటయందు శ్రీరామానుజులవారు హరిజనులకు సం॥ న కొక్కరోజు దేవాలయ ప్రవేశమును సమ్మతించగా అది నేటికిని జరుగుచున్నది. మితిమీరిన ఆచారవంతురాలగు ముసలమ్మకూడ కాశీకివెళ్లినప్పుడు మాలవాడలోనున్న గాడిదేవి గుడికిపోయి గవ్వలువేసివచ్చుచున్నది. అది చేయనిచో కాశీయాత్రఫలము దక్కదని ఆమెకు తెలియును. కావున స్త్రీలు అరమరికలులేకుండా ఈ సంస్కరణమును సమ్మతించి అమలు జరుపదగును. స్త్రీలు తలుచుకుంటే అసలు అస్పృశ్యత కొద్దిరోజులలోనే మాయమవుతుంది. వారి అపరిశుభ్రతయే అస్పృశ్యతకు ముఖ్యకారణము. ఆఅపరిశుభ్రతనుమనమువారిని దగ్గరకురానిచ్చి పరిశుభ్రముగానుండుట నేర్పియు, అందుకువారికి సహాయముచేసియు తొలగింపవచ్చును. మనము వారినెప్పుడు దగ్గరకురానిచ్చితిమో అప్పుడే తామున్నూ మనవలె పరిశుభ్రముగానుండవలెననే స్పృహవారికి కలుగును. ఏతులసిపూజ అనియో ఏమంగళహారతులనియో, పేరుపెట్టి తరచు హరిజనస్త్రీలను అగ్రజాతిస్త్రీలుపిలుచుచో వారికి పరిశుభ్రముగానుండుట అలవాటగును. అందుకై ధనవంతులు ఉచితముగా చమురు, సబ్బు మున్నగునవి వారికివ్వవచ్చును. కావున స్త్రీలెల్లరు హరిజనదేవాలయ ప్రవేశముసహా హరిజనోద్ధారణకు సకలవిధముల తోడ్పడగోరుచున్నాము. దేవాదాయములమంత్రి కోటిరెడ్డిగారివద్దకు హరిజననాయకులు సవర్ణనాయకులు కలిసి రాయబారము వెళ్లిరి. ఆరాయబారవర్గమునకు శ్రీమతి రామసుబ్బమ్మగారు (కోటిరెడ్డిగారి ధర్మపత్ని) నాయకురాలైనడిపినారు. గొప్ప ఉద్యోగస్థులభార్య లిట్టిపనులు గావించుటకలదు. కాని ఈమె అట్లుగాక స్వతంత్రముగా జిల్లాబోర్డుపరిపాలించిన సమర్థురాలు. స్వతంత్రవ్యక్తిత్వముగనే ఈపనిచేసినదనవలెను. ఈమె యింతటితో యూరకొనక ఆంధ్రనారీమణులలో తీవ్రప్రచారమును ఇందుకై గావింప కోరెదము.

## శ్రీత్యాగరాజ స్వామివారి శతాబ్దిక వార్షికోత్సవము.

ఈ జనవరి 11 వ తేదినాటికి శ్రీత్యాగరాజ స్వామివారు శ్రీరామ సాయుజ్యమంది నూరేండ్లు నిండినది. ఆయనకీర్తనలలో సంగీతము ఉత్తమమైనది. సాహిత్యము కూడా భావగర్భితమై ముద్దులు మూటగట్టుతేట తెలుగు. కావుననే అవి 100 సం॥ లుగా దక్షిణ భారతదేశమున కర్నాటక సంగీత ప్రియులైన వారి రసహృదయములలో రాజ్యము చేయుచున్నవి. ఆయన కవి, సంగీత కళావేత్తయునే గాక భక్తుడు కూడ. ఆయన ఆయావిశేషములను ఇన్నాళ్లుగా చాలామంది ప్రశంసించియే యున్నారు. ముఖ్యముగా ఆయన గృహలక్ష్ముల పాలిటి కొంగుబంగారము అనిమేము చెప్పెదము. ఒకసారి శ్రీసర్. యస్. రాధాకృష్ణన్‌గారొక స్త్రీలసభలో "స్త్రీ కోరునది, ఆమెకు కావలసినది, ఆమెనొకరు ఉద్ధరించుట కాదు; ఆలన, లాలన, పాలన" అని చెప్పి యున్నారు. ఆయాచర్యలు కరుణారసమున కలుగునవి. సంగీత కళానిధియగు శ్రీ టి. యల్. వెంకట్రామయ్యరుగారు శ్రీ త్యాగరాజు సంగీత సాహిత్యములను ప్రశంసిస్తూ ఇట్లన్నారు:-

"శ్రీత్యాగయ్య సంగీతంలో మరొక విశేషము, అదిపూర్తిగా భావపూరితము. అంటే ఆ యా కీర్తనలకు అమర్చినరాగములు భాషలోగల భావమును చక్కగా వెల్లడి పరచుచున్నవి. అందులో ముఖ్యంగా కరుణారస పూరితమైన కీర్తనలు సాటిలేని రచనలు. వానిలో విషాద భావోపేతములే మధురాతి మధురకీర్తనలు అని ఆయనయే పల్కి ఉన్నారు."

స్త్రీలకుగల ఆర్థిక సాంఘికాది స్థితిగతులను పట్టి వారి కెన్నియో సంసారపు చిక్కులు. ఎంతసింగారించుకొని తిరుగుతున్నా, ఎంతగా చిరునవ్వులను వెదజల్లుతున్నా, ఇంటిపనులతో ఎంతసతమత మగుచున్నా తల్లికి తండ్రికి, అత్తకు మామకు, ఆడుబిడ్డకు తోడికోడలికి, తమ్మునికి తనయునికి, కడకు భర్తకైనా చెప్పజాలని, చెప్పరాని పరమరహస్యమేదో ఆమెను క్రుంగదీస్తుంటుంది. గూఢమయిన వేదనయేదో ఆమెను ఉడికించి, పేల్చి, తేలుస్తుంటుంది. తీరని, తెలియని సమస్యయేదో ఆమెహృదయాన్ని మెలేబెట్టి పిండివేస్తుంటుంది. అట్టిదీనాతీదీన, ఏకాంతమున, ఏదోకీర్తనలో "జగమేలే పరమాత్మా ఎవరితో మొరలిడుదు" వంటి ఏచరణమో ఎత్తుకొని గొంతెత్తి ఆలాపించిన చాలును; చాలును. స్త్రీలందరు సంగీతములో నిపుణులు కారు. అందరికిని శ్రావ్యమైనకంఠమున్నూ వుండదు. కాని ఆయాకీర్తనలను కొంచెము సరళముగా, జాలుగా పలికితే చాలు. అందుకు తగిన భావరాగతాళములందులోనే ఇమిడి ఉన్నవి. చిత్తశాంతి గోరుజీవిని, నిండుమనస్సుతో ఆలాపించిన మాత్రాన, గుడ్డివాణ్ణి మంచివాడుచేయిపట్టుకొనినడిపించుకొని వెళ్ళినట్లు ఆకీర్తనలే శాంతినిలయమునకు కొనిపోయి చేర్చగలవు. అదీ శ్రీత్యాగరాజు మాహాత్మ్యము. ఆమాహాత్మ్యమునకు జోహారులొనర్పని "గృహలక్ష్మి" ఉండబోదు. సంగీత విద్వాంసు లగు తమిళులు క్రమముగా త్యాగరాజును బహిష్కరింప వచ్చునేమో. అందంతగా ప్రవేశంలేని ఆంధ్రులాయన కీర్తి ధ్వజమును చక్కగా నిలువబెట్టలేరేమో. కాని ఆంధ్ర గృహలక్ష్మి మాత్రము ఆయనచేయి విడువజాలదు. కావుననే కాబోలు, ఆంధ్రనారీమణి యగు శ్రీమతి బెంగుళూరి నాగరత్నంగారికే ఆయన సమాధి జీర్ణోద్ధరణమొనర్చి, ఆయన ఆరాధనల నారంభించు కీర్తిభాగ్యములు దక్కినవి. శ్రీత్యాగరాజ స్వామివారి కీర్తి జ్యోతి తెలుగు వెలుగు కలంత కాలము వెలుగుగాక.

బంగాళమున మతకలహములు:- స్త్రీలదుస్థితి.

సుమారారునెలలుగా బంగాళమున చెలరేగిన అల్లరులలో స్త్రీలు చాలకష్టపడిరని పత్రికలలో చూస్తున్నాము. అల్లరులు శాంతించినవే గాని స్త్రీలకింకను శాంతియు సంరక్షణమును చేకూరలేదు అని తెలియుచున్నది. అహింసావాదులగు గాంధిగారికి స్త్రీలంతమ్ము రక్షించుకొను ఉపాయ మేమిటాయని మిక్కిలి వేదనగలిగినది. స్త్రీలు ఆత్మహత్య చేసుకొనుటా, ఆయుధముల నుపయోగించుటా యనునది నిర్ణయింపరాని సందిగ్ధస్థితికూడ ఆయనకు ఏర్పడినది. ఆయననొఖలికే వెళ్లి పాదచారియై గ్రామ గ్రామమునకు పోయి స్త్రీపురుషులగు బాధితులకు శాంతిధైర్యాదులను బోధిస్తున్నారు. ముసల్మానులనుండి స్నేహసఖ్యభావములను అర్థిస్తున్నారు. అయితే వారచ్చట అవిధముగా తంటాలుపడుచున్నారుగాని ముసల్మానుల జనానాలలో బలవంతముగా త్రోయబడిన హిందూ యువతులకు ఇంకను మోక్షము కలుగలేదని తెలియు

చున్నది. ప్రభుత్వమున్ను తోడ్పడుచున్నట్టు తోచదు. ఇంతేకాదు. కాంగ్రెసుఅధ్యక్షులగు శ్రీకృప్లానిగారి ధర్మపత్ని శ్రీమతిసుచేత కృప్లానీగారినిదుండగీడులెవ్వరో అపహరించి గొనిపోవయత్నించి రనికూడ ఇండియన్ యక్స్ప్రెస్ పత్రిక ప్రకటించియున్నది. మహాత్ముని సన్నిధానములోనే, కాంగ్రెసు అధ్యక్షుని ధర్మపత్నికే, రక్షణము లేనప్పుడు బంగాళమున హిందూవనితలపాట్లు ఎన్నదరమా? మరివారికి గత్యంతరమేమి? పూర్వము వేదవతి అగ్నిప్రవేశించెను. దమయంతి కిరాతుని భస్మమొనర్చినది. ద్రౌపతి శ్రీకృష్ణుని తలచుకొని అక్షయవలువలు పొంది మానసంరక్షణము గావించుకొన్నది. ఎందరో హిందూరాణులు రాచకుమార్తెలు మొత్తముగా అగ్నిలో తగులబడి పోయిరి. అవన్నియు ఈకాలమున సంభవములుకావు. హిందూమహాసభవారు స్త్రీలుఆత్మరక్షణకై ఆయుధములనుపయోగించుడని తీర్మానించిరి. అందరికీ ఝూన్సీవలె కత్తిపట్టుట సాధ్యముకాదని గాంధీమహాత్ముడనును. ఈపరిస్థితులలో శ్రీమతి సుచేత కృప్లానియేగాక, సుశీలానాయర్ ఆబాగాంధి, అంతస్సలాంకన్య మున్నగు స్త్రీలును అనుచరులై ధైర్యముతో శాంతిప్రచారము చేయుచున్నందులకు స్త్రీలెల్లరు గర్వించదగును. ఆందా ముసల్మాన్ యువతి ముస్లింసోదరులను హిందువులయెడ సఖ్యభావమువహించునట్లొర్ప 25 రోజులు ఉపవాసముగావించి, వారివల్ల వ్రాతమూలముగ వాగ్దత్తముబడసియున్నది. త్వరలోబంగాళమందలి స్త్రీలయిక్కట్లు తొలగుగాక.

## శ్రీ విజయనగరం మహారాణీ విద్యావతీదేవిగారికి స్వాగతము.

శ్రీవిజయనగరం మహారాణీ విద్యావతీదేవిగారు ఇటీవలస్విడ్జర్లాండులో జరిగిన అంతర్జాతీయ మహిళా సమ్మేళన మహాసభకు (The International Women's alliance conference) భారతమహిళాసంఘము యొక్క ప్రతినిధిగావెళ్లి వచ్చిఉన్నారు. వారికి మేముహృదయపూర్వకముగా స్వాగతమునిచ్చుచున్నాము. ఇటీవలనే యునైటెడ్ నేషన్స్ మహాసభయందు శ్రీమతి. విజయలక్ష్మీపండిట్ గారు తమప్రతిభనుచూపి ఆసభకు వచ్చినవారి అందరిచే పొగడబడియున్నారు. అట్లేమహారాణీసాహెబావారును, పైసభయందువిశేష ప్రజ్ఞను కనుపరచి యుందురు. నానాదేశములనుండి వచ్చిన ఇతరప్రతినిధుల ప్రశంసల నందియుందురనుటకు సందేహములేదు. ఈమాసారంభమున మద్రాసునందలి పంజాబీసంఘమువారు ఆమెకు స్వాగతమిచ్చియున్నారు. అందులో ఆమెయిచ్చిన ఉపన్యాసమున్ను మావిశ్వాసమును బలపరచుచున్నది. యూరపుదేశములలో యుద్ధమువల్ల స్థితిగతులనన్నియు భీభత్సముగాఉన్నవి. వానినిచూచినప్పుడు కరుణామయమగు ఆమెహృదయము ఎంతో కష్టపడి యుండునని తోచుచున్నది. వివిధదేశముల మహిళాసంఘముల వారున్నూ కలిసి యొక సంఘము నేర్పరచగా వారు ఆయాదేశములను పరిశీలనతో గమనించుచు సంచారమొనర్చినచో ఇకపై ప్రపంచమున యుద్ధములే యుండవేమో. అచ్చట చర్చించిన ముఖ్యవిషయములున్ను "శాంతి సంరక్షణకు" సంబంధించినవే. శ్రీమహారాణీ విద్యావతీ దేవిగారు ఇట్లే జాతీయ, అంతర్జాతీయ విషయముల నింకను పాల్గొనుచు ప్రజలను ముఖ్యముగా సాటినారీమణులను ఆదరించుచుందురు అని గాఢముగా తలంచుచున్నాము. వారికందుకు గావలసిన, తీరిక, ఓపిక, విద్య, ధనము, ఉపజ్ఞ, ఉపపత్తి, ఉద్రేకము, ఉత్సాహము, అనుభవము, వయఃపరిపక్వత, నయము, వినయము అన్నియు కలవని అందరికి తెలిసిన సంగతే.

# పాకకళ

(శ్రీమతి కే. లక్ష్మమ్మగారు)

## రసగుల్ల

పదినిముషములముందుగా ½ పలం గోధుమనూక తడిపివుంచేది. 1 శేరుపాలలో కొంచమునీళ్లువేసి పొయ్యిమీదపెట్టి చిటికెడు నిమ్మపుప్పువేసిన పాలువిరుగును. వాటినివడియగట్టి ఆగుజ్జులో నానినగోధుమ నూకకలిపి పళ్ళెములో వేసి బాగుగారుద్ది దానిని చిన్న పంచి నిమ్మకాయలంతివుండలుచేసి ఒక్కొక్కవుండలో రెండు, మూడు బాదముపలుకులు పెట్టవలెను. ½ వీశెచక్కెరలేతపాకముపట్టి ఈ వుండలు అందులోవేసి కొంచెము పచ్చ కర్పూరము చల్లి ఒకజాము పూరనిచ్చి తీసికొనుచుండవలెను.

## గప్‌చిప్‌లు

ఒక అరశాకు పెసరపప్పు 1 అరశాకు మినప్పప్పు నానబోసి ¼ అరశాకు గోధుమనూక తడిపివుంచి పెసరపప్పు,మినపపప్పు మెత్తగారుబ్బి గోధుమనూక దానిలోవేసి బాగకలిపి, 15 పలములచక్కెర లేతపాకముపట్టి, ఆపాకమును కొంచముసెగమీదవుంచి ఆపిండిని గోరుమీఠీలవలె నేతిలోదేవి పాకములోవేయువలెను.

## గోధుమ హల్వా

1 శేరుగోధుమలు నానబోసి రెండురోజులుంచి మూడవరోజురుబ్బి పాలుదీసి 30 పలములచక్కెర పాకముపట్టి పాలుదానిలోపోసి నిలుపక కలియబెట్టుచుండవలెను. కొంచెముగడ్డకట్టుకొనునపుడు 5 పలముల నెయ్యిపోసికలియ బెట్టుచు మరల 5 పలముల నెయ్యి వేయించిన ముంతమామిడిపప్పు, యాలకపొడివేసి కలియబెట్టి దించవలెను.

## మాలపూరీ

15 పలముల గోధుమపిండి, నెయ్యి, నీళ్లు వేసి బాగామర్దించి 1 గంట నాననిచ్చి వుండలు చేసి అప్పడములు వత్తి, జీడిపప్పు బాదంపప్పు సీనాకలకండ, కొబ్బెర, కొన్నిపలుకులు చేసికలిపి, ఒక్కొక్క అప్పడములో కొన్నిపలుకులు వేసి చాపచుట్టినట్లుచుట్టి 1 వీశెచక్కెర లేతపాకము పట్టి, పూరీలను నేతిలో దేవి పాకములో వేయవలెను.

## పూరీలడ్డు

½ వీశగోధుమపిండి నీళ్లువేసిగట్టిగా కలిపి 5 పలములనెయ్యిపోసి బాగామర్దించి కొంచం నాననిచ్చి అప్పడాలుచేసి నేతిలోదేవి, వాటిని 1 వీశచక్కెర కలిపిదంచి, జీడిపప్పు ఏలకపొడి కుంకుమపువ్వు పచ్చ కర్పూరం వేసికలిపి వుండలు చేయవలెను. ఒకవేళవుండలు కాని యడల కొంచంపాలుచల్లి చేయవచ్చును.

## జిలేబి వడ

$\frac{1}{2}$ అరశాకుగోధుమ నూకతడిపివుంచి 1 శేరుమినపప్పునానబెట్టి మెత్తగారుబ్బి 1 వీశచక్కెర పాకంపట్టి పిండి గోధుమనూక కలిపి వడమాదిరి తట్టి నేతిలోవేచి పాకంలోవేయవలెను.

## రవపొంగలం

గోధుమనూక వుదయముననే పెరుగులోతడిపివుంచి మధ్యాహ్నం పచ్చిమిరపకాయలు,అల్లం, యుల్లి గడ్డలు సన్నగతరిగి కొంచం, జీడిపప్పులు, కరేపాకు వుప్పు యివన్నియు దానిలోవేసి జారుగాకలిపి పొంగలము పోయవలెను.

## తలియఅప్పడాలు

$\frac{1}{2}$ శేరు వుప్పుడు బియ్యమునానబోసి ఎండబెట్టి మెత్తగావిసరి యీపిండి 1 అరశాకు గోధుమపిండి పొయుంతగ్రిం పెరుగుతోతడిపి వుదయము కొంచం వుప్పువేసి బాగాదంచి అప్పడాలుచేసి ఎండబెట్టి నేతిలోవే యించవలెను.

## నువ్వుల హల్వా

1 శేరుపాలు $\frac{1}{2}$ శేరు నీళ్లుకాగనిచ్చి $\frac{1}{4}$ శేరుగోధుమనూక $\frac{1}{4}$ శేరునువ్వులపప్పు వేయించివేసి వుడికిన తర్వాత దానిలో 3 పలములజీడిపప్పు 1 పలందాగ్రిక్ష, $\frac{1}{2}$ శేరుచక్కెర 10 పలముల నెయ్యివేసి బాగకలిపి పళ్ళెంలోపోసి కొంచంఆరిన తర్వాత బిళ్లలుగాకొయ్యవలెను.

## హల్వాపూరి

1 శేరు పాలుకాగనిచ్చి $\frac{1}{4}$ శేరుసబ్బుబియ్యముపోసి బాగావుడకనిచ్చి, 2 పలములజీడిపప్పు 1 పలం బాదంపప్పు 1 పలందాగ్రిక్ష $\frac{1}{4}$ శేరుచక్కెర 5 పలముల నెయ్యివేసి బాగాకలిపి, గట్టిపడిన తర్వాత దించి, గోధుమపిండి అప్పడాలుచేసి,అప్పడములో కొంచంపెట్టి,పైన మరొక్క అప్పడమువేసి కజ్జికాయచక్రముతో చుట్టూగీచి నెయ్యిలో దేవవలెను.

## పప్పుబిళ్లలు

3 అరశాకులబియ్యము కడిగి, ఆరవేసి మెత్తగావిసరి, 1 అరశాకుగోధుమ నూకతడిపివుంచి, సారపప్పు,దోస పప్పు, పుచ్చపప్పు, గుమ్మడిపప్పు జీడిపప్పు. కలిపి మొత్తము రెండు అరశాకులు చేసిపిండిలోపోసి, వెన్న, కొంచం నీళ్లువేసి కలిపి చిన్నచిన్నబిళ్ళలు చేసి యుంచి నేతిలో వేయించితీయవలెను.

## పసంద్ సియ్యాళి

2 అరశాకులు పెసరపప్పు 1 అరశాకుశనగపప్పు 1 అరశాకుకందిపప్పునానవేసి కొంచమునూకపారుగారుబ్బి $\frac{1}{2}$ అరశాకుగోధుమనూక తడిపివుంచి దానిలోకలిపి ఒకపాత్రలోనీరుపోసి గుడ్డకట్టిఆప్పచ్చిమోస్తరుచేసి ఆ గుడ్డపైపెట్టి దానిపై మరొకపాత్ర బోర్లించి ఆవిరితో వుడుకపెట్టవలెను. కొంచము మిరపకాయలు వేయించి కొబ్బెరచాయపప్పు పొడి అన్నికలిపి పొడిగొట్టివుంచి, వుడుకపెట్టిన ఆప్పచ్చిని బిళ్లలుగాకోసి బాణలిలో 5 పలముల నూనెగాని లేకనెయ్యిగాని కాగనిచ్చి ఆవాలు, కరేపాకు, యుల్లిగడ్డలువేసి తాలింపుపెట్టి. ఆపొడి చల్లవలెను.

# అవస్థ

ఏకాంకిక.

శ్రీమతి సమయమంత్రి రాజ్యలక్ష్మీదేవిగారు.

(బలరామ్‌గారింట్లో, వకీలుబలరామ్ మధ్యాహ్నం3 గం. కోర్టునుంచి యింటికివస్తాడు. Boot చప్పుడు.)

బల—ప్రేమా, Dear ప్రేమా! ఏదీ, ఎక్కడాకనపడదు. (బిగ్గరగా) ప్రేమా, ప్రేమా, లేనట్లుంది. వెంకీ, వెంకీ, అదీపలకదు. ఏమ్‌వెంకీ!

(లోనుంచి వస్తున్నానండీ అని వెంకికేకవేయును) (చంటిబిడ్డ ఏడ్పు) ఏమిటిది! అదీ, ఎవరో వచ్చినట్టున్నారు. అందుచేతనే రాణీగారివ్వాళ ఎదురుగా రాలేదు.

వెంకి:—అమ్మయ్య! వచ్చారుబాబూ, ఇడుగో నండబ్బాయి. ఇందాకటినుంచీ ఒక్కటేగోల, సచ్చిపోతున్నానండి పట్టుకోలేక. ఇడిగోఅబ్బాయ్, పాపాయి, (పిల్లవాడు ఏడ్చుచుండును.)

బలరామ్:—ఎవరేఈ అబ్బాయ్, పాపం.

వెంకి:—మనబ్బాయ్‌గారేనండి. అమ్మగారు యినిగిపోయారండి, ఈ యబ్బాయి గోలమూలాన్ని. ఊరుకోండబ్బాయి గారు, అడుగో బూచాడు, డూ, డూ, డూ.

బలరామ్:—ఏదీ మీఅమ్మగారు, వారివద్దకూర్చున్నారా?

వెంకి:-వారురాలేదండి. ఈఅబ్బాయిగారినే ఎవరోమనిసిచేత పంపించారండి. ఉమ్ జో జో జో జో (కుర్రవాడేడ్చుచునే యుండును.)

బలరామ్:-అయితే మీ అమ్మగారు.........

వెంకి:-యెల్లారండి, ఇప్పుడే. దాయ్, దాయ్, ఉండండబ్బాయిగారూ.

బలరామ్: (ఆశ్చర్యంగా) మరి ఈ అబ్బాయ్.

వెంకి:- ఉండండబ్బాయ్‌గారు, ఆదిగోమ్యావు, మరీ నేనుగూడా యెల్లిపోతానన్నానండి. అమ్మగారు, మీరొచ్చేవరకూ ఆగి, మీరొచ్చాక, ఈన్ని మీకిచ్చేసి యెల్లిపొమ్మన్నారండి.

బలరామ్:-మరి మీఅమ్మగారెప్పుడు వస్తారూ.

వెంకి:-ఏమో నాకుతెల్దండి. పెట్టె గిట్టె అన్నీ తీసుకునే యెల్లారండి.

బలరామ్:-(ఆశ్చర్యంతో కంగారుతో) ఏం, ఏమేన్నా టెలిగ్రాంకాని వచ్చిందా.

వెంకి:-కాదు, వుత్తరమేనండి. ఆరునేకపోతే కొత్తఅమ్మగారి కాడనేనుండనని శానగా యేడిసానండి. ఇరుగోనండబ్బాయిగారు, నేయెల్లిపోతానండి. యెల్లండమ్మా అబ్బాయిగారూ, నాన్నగారమ్మా, ఏడకండి.

బలరామ్.-(విసుగుతో) నాకిస్తావేమిటి! ఎత్తుకో, ఏమిటీ అర్థంకాని అవస్థ.

వెంకి:-ఏమో నాకుతెల్దండి. మీ అబ్బాయిగార్ని మీకిచ్చినాక, అమ్మగారు నన్నెల్లిపొమ్మన్నారు. నేవెల్లిపోతున్నా నేనెత్తుకోలేనీ యబ్బాయిగార్ని. (వెంకివెళ్లును.)

బలరామ్:-(విసుగుతో) అబ్బా! ఎవరీ అబ్బాయి. పాపం, గోలపెట్టేస్తున్నాడు. కేసునెగ్గాంకదా అని సంతోషంతో యింటికి వచ్చేసరికి ఇదేదో నరకంలా. దా అబ్బాయి, పాపం. ఎల్లా వూరుకోపెట్టాలో కుర్రాళ్లని. చూడమ్మాచూడు. అదిగో పాప. నాదృష్టిలో ఎవరికీ ఈయీడుపిల్లలులేరే. డిష్ ఇంకాఏడ్పే. ఇదిగో బొబ్బతాగమ్మ. నన్నుచూసి మరీ ఏడుస్తున్నాడు. కొత్తకావును. చూడు, టామీ, దాదా, పాపాయి నియ్యనా! (తలుపుకొట్టిన చప్పుడు) ఏమ్, ఎవరూ. (తలుపు తీయును,) ఓహోమీరారండి.అరే, ఈ కుర్రాడు ఏడుపుమాని మీదగ్గరకు వచ్చేశాడేం.

రాఘవయ్య:-మరిమావాడే గదండి, పాపం వాడి Mother దగ్గరకన్నా, నాదగ్గరే ఎక్కువచనువు. నాన్న నాన్న! నాకోసం బెంగపెట్టుకున్నావా. వెర్రినాన్ని, ఎంత చిక్కిపోయావో?

బలరామ్:-(ఆశ్చర్యంగా) ఏమిటీ, మీవాడా, పాపం, ఇందాకటినుంచి ఒకటేఏడ్పు: ఎన్నిమరపించినా వూరుకోటంలేదు. పాపం. అయితే వీడు యిక్కడికెల్లా వచ్చాడూ.

రాఘవయ్య:-చిత్తం. మీదయవల్ల మళ్లామావాడూ, నేనూ, కలుసుకున్నాం. మీరుణం తీర్చుకోలేను. ఇవ్వాళబండి లేటుగావచ్చింది. తిన్నగా కోర్టుకు వెడితే, గుమస్తాగారు అబ్బాయిని యిచ్చేందుకు ఒప్పదల అయ్యింది కేసు అనీ, మీరుకోర్టునుంచి బయలుదేరారనీ చెప్పారు. సంతోషంతో ఆవిడవున్నబసకు వెళ్లాను. మరి, కుర్రవాడికోసం తప్పదుగదండి. ఇప్పడే మీయింటికి పంపాం అని చెప్పారండి. ఇక్కడకువచ్చాను. మరినాకు శలవుయిప్పిస్తారా! దయవుంచండి. మీమేలు మరవను. అన్నట్లు అబ్బాయి నాకుచేరినట్లు వుత్తరం యిదిగోనండి. (వెళ్లును).

బలరామ్:-అమ్మయ్య, ఇప్పటికీ కుర్రాడిగొడవ వదిలింది. ఇక ప్రేమవిషయం ఏమిటో తెలుసుకోవాలి. ఎవరికైనాజబ్బుగావుందా, లేకపోతే అంతఅర్జంటుగా వెళ్లాల్సిన కారణంఏమిటో. ఆవుత్తరం ఎక్కడ పెట్టిందో. (వెతుకును) అమ్మయ్య ఇదేదోవుత్తరమే. (చదువును.)

"నమస్కారాలు.

మీలో యింత కుత్సితం వుందని తెలియక మనసార ప్రేమించాను; ఇక ఆమెను తెచ్చుకోవచ్చును. నేను మాయింటికి పోతున్నా, శలవు.

ఇట్లు,

భగ్నహృదయ, ప్రేమ."

ఈరెండోవుత్తరం.

"మీతోచెప్పినప్రకారం కుర్రవాణ్ణి మీకుపంపాను. నేను వెళ్లిపోతున్నా.

ప్రమద"

(తేరుకుని) అబ్బా! ఇదాగొడవ. ప్రేమ పట్టివెర్రిప్రేమ. ఈవుత్తరాన్ని, కుర్రవాణ్ణీచూసి దురభిప్రాయ పడింది. వృత్తిమొదలుపెట్టాక, దరిద్రపుకేసులన్నీ పట్టవలసివస్తుంది. పాడువృత్తి. ఏంచెయ్యటం. నేను వెడితేనేగాని దేవి కాగ్రహం వదలదు. ఛీ, జన్మలో ఇటువంటికేసు పట్టకూడదు.

రెండోరంగం.

(బలరామ్:-అత్తవారివూళ్లో, అత్తవారియింటికి వెళ్తాడు.)

బలరామ్మామగారు:-ఓహో, రండి, క్షేమమా. అమ్మాయ్, అల్లుడువచ్చారు. కాళ్లుకడుక్కుందుకు నీళ్లూ అవ్వీచూడు. (బలరామ్తో) ఇప్పుడేవస్తాను. బజారులోపనివుంది.

బలరామ్:- (తెల్లపోతూ) ఏమిటీమర్యాద. (ప్రేమ, నీళ్లచెంబు అక్కడపెట్టును) ప్రేమా, అలాచూస్తా వేం ఎవరినోలాగ. ఆనీళ్లక్కడపెట్టావేం.

ప్రేమ:-.........

బలరామ్:-ఇవ్వవూ! పోనీ, నేనే తీసుకుంటాలే. కులాసగావున్నావా.?

ప్రేమ:-.........

బలరామ్:-మాట్లాడవూ.

ప్రేమ:-.........

బలరామ్:-చూడు, ప్రేమా. అంతా, నువ్వనుమానపడ్డావు. ఇందులో నేను నిర్దోషిని నిజంతెల్సుకుంటే నీవు చాలా పశ్చాత్తాపపడతావు.

ప్రేమ:- (కోపంగా) తెల్సిందిగా నిజం.

బలరామ్:-అది నిజంకాదు.

ప్రేమ:-అంటే అవుతుందా! మీరెన్నిచెప్పండి, నేనురాను.

బలరామ్:-అలాకాదుప్రేమా! పోనీ నువ్వురాకపోతే, నేను సన్యాసం పుచ్చుకోపోతాను. ఇల్లా చూడు. అదిగో ఆకేసు రికార్డు. ఇదిగో రశీదువుత్తరం. ఆకుర్రవాడిని వాళ్లతండ్రికి వప్పగించేశాను. ఇవి చదివి, నువ్వు నానిర్దోషిత్వాన్ని వప్పుకుంటే చాలును. నేను నిశ్చింతగా వెళ్లిపోయి ఏచెట్టుక్రిందో కాలక్షేపం చేస్తాను.

ప్రేమ:- (జాలిగా) ఏవీ, చూస్తాను. (కొంచంసేపుతాళి.)

బలరామ్:-చదివావా! ప్రేమా.

ప్రేమ.:- (దీనంగా) క్షమించరూ.

బలరామ్:-వద్దుప్రేమా. ఇటువంటి కేసుపట్టినందుకు నువ్వేనన్ను క్షమించాలి. చూడు! మనప్రేమ సాక్షిగా ఇకజన్మలో, నేనీ divorce కేసులు పట్టను.

ప్రేమ:-(అనందంతో) లేవండి. నేనన్నీసర్దుకోవాలి. మళ్లామనం Mail catch చెయ్యాలేం.

బలరామ్:-అమ్మయ్య, నిన్నటినుంచి ఎంత అవస్థపడ్డాను.

సంపూర్ణం.

# స్వీకారము విమర్శ

## ఉదయభాను

ఉదయభాను, అనెడి పిల్లలభావములు పిల్లల కొరకైన భావములు, పిల్లలేవ్యక్తపరచగా ప్రకటించే చిన్న పత్రిక. మైలాపూరులో ముఖ్యముగా కేసరిఉన్నత విద్యాలయంలో చదివే తెలుగు బాలబాలికలు ఇతర తెలుగు బాలబాలికలు చేరి, ఉదయభాను బాలసంఘంగా ఏర్పడి దీనిని ఆసంఘంతరపున ప్రచురిస్తున్నారు. సైక్లోస్టైలులో ప్రచురణగుచున్నది. పైసంఘంవారు తమఅభిప్రాయమునిట్లనిప్రచురించి యున్నారు.

“బాలబాలికలకు, బాల్యంనుంచి విజ్ఞానం, సారస్వతం, కళమొదలగునవి వృద్ధిపొందుటకున్నూ, ఉత్సాహం కలుగుటకున్నూ యీఉదయభాను పత్రికయున్ను ఒకపుస్తక భాండాగారమున్నూస్థాపించి మాశక్తికొద్ది సేవ చేయుటయే మాఅభిప్రాయం.”

ఈఅభిప్రాయము ప్రశంసార్హము. ఇందులో “చంపదగినయట్టిశత్రువు చిక్కనేనికీడు చేయరాదు” (పద్యంలో తప్పుగలదు) అనేపద్యమును బొమ్మలతోవివరించడం బిడ్డలకెంతో ఆకర్షణీయాగా ఉన్నది. పిల్లలు, పిల్లలకొరకు పత్రిక నిర్వహించుకోవడం అపూర్వప్రయత్నం. త్వరలో ఇది అచ్చుపత్రిక కూడా కావలననియు మాఆశీర్వాదం.

## చిత్రాంగి.

చిత్రాంగి (1946) డిసంబరు సంచిక: ఆకర్షణీయంగా హెచ్చుపుటలలో వివిధవ్యాసాలు, కథలు, చిత్రాలతో అందంగాప్రచురింప బడినది. ధర 0-12-0 అణాలట.

## వినయాశ్రమ 12 వ వార్షికనివేదిక.

వినయాశ్రమము ఆంధ్రదేశంలో శ్రీగొల్లపూడి సీతారామశాస్త్రులుగారు 12 సం॥ల నుండినడుపుచున్న గాంధీప్రబోధిత నిర్మాణకార్యక్రమ కేంద్రము. దాని 12వ సం॥పు నివేదిక మాకందినది. సుమారు 22 వేల రూ॥లఆదాయము, అంతవ్యయము కన్పించుచున్నది. కేవల మంతయు ఖర్చువెచ్చ మేగాక భవనాదికములపైగూడ కొంతవెచ్చమైయున్నది. కూలంకషముగ నివేదికను విమర్శించుట కిచట స్థలముచాలదు. మొత్తము మీద శ్రద్ధగా నిర్వహింప బడుచున్న సంస్థఇది. అట్లనిలోపములు లేవనము. సానుభూతిగల కాంగ్రెసు ప్రభుత్వాదరణలోనిసంస్థ, ఇతోధిక సేవ నింతకన్న నిపుణముగాను ఫలప్రదముగాను చేయుట కవకాశము లేక పోలేదు. అట్టిఅవకాశములను జారవిడువని చాకచక్యము ఆశ్రమపరిపాలకులకు గలదని ఈనివేదిక యందానవాళ్లుగలదు.

—:o:—

Printed and Published by Dr. S. Seshagiri Rao. at the Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.